అక్టోబర్-నవంబర్, 1995

# స్రవంతి



దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆం.ప్ర.
హైదరాబాదు

వెల : రూ. 4-00

## ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఉత్తమ లెక్చరర్ అవార్డు గ్రహీత శ్రీ చంద్రక సత్యనారాయణ గారి సన్మానము



*హిందీ దివస్ సందర్భముగా ఉత్తమ లెక్చరర్ అవార్డు గ్రహీత శ్రీ చంద్రక సత్యనారాయణ గారిని సన్మానించుచున్న చిత్రం.*

## దక్షిణ భారత హిందీ ప్రచార సభ
## 60 స్నాతకోత్సవం

రాబోవు ఫిబ్రవరి 25 నాడు మద్రాసులో జరుగనున్న హిందీ స్నాతకోత్సవం ది. 24 ఫిబ్రవరిన జరుగును. శ్రీరంగనాథ మిశ్రగారు స్నాతకోపన్యాసం గావించెదరు. శ్రీ బి.డి. జత్తిగారు అధ్యక్షత వహించెదరు.

కార్యదర్శి విమలాబాయి గారు తెలియజేస్తున్నారు.

టెలిగ్రామ్ : హిందీ సంఘ్

ఫోన్ : 316865

499 - 500

# స్రవంతి

సాహిత్య మాసపత్రిక

అక్టోబర్ - నవంబర్, 1995

సంపాదకులు

శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ

శ్రీ ఈమని దయానంద

శ్రీ అన్నదానం శంకరశాస్త్రి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర

ఖైరతాబాదు, హైదరాబాద్ - 500 004.

సంవత్సర చందా
రూ. 40-00

విడి ప్రతి
రూ. 4-00

Recommended for use in all the Public Libraries and School Libraries by the Director of Public Libraries, Andhra State, Madras Vide Proceedings Sl. No. 30/55 dated 6th January 1955.

# ఈ సంచికలో.....

సంపాదకీయం

# గాంధీజయంతి

అక్టోబరు 2వ తేదీ గాంధీ జయంతి దినం. భారతదేశానికి స్వాతంత్ర్యం సముపార్జించిపెట్టిన మహామనీషి, పూర్ణ పురుషుడు మహాత్మాగాంధీజీ జన్మించిన దినమది. భారతీయులకు పరమ పవిత్రదినమది. భావి భారత నిర్మాణానికి, రామరాజ్య స్థాపనకు గాంధీజీ సుదృఢమైన, సువ్యవస్థితమైన నిర్మాణ కార్యక్రమాన్ని ఉపదేశించి వున్నారు. హింద్ స్వరాజ్య అనే గ్రంథంలో తను ఆశిస్తున్న భారతదేశ భవిష్యత్స్వరూపానికి రూపులు దిద్దివున్నారు. భారతదేశం గ్రామాలు ప్రధానంగాగల దేశం. నగరాలకంటే గ్రామాలకు మనదేశంలో గల ప్రాముఖ్యత చాలా ఎక్కువ. గ్రామాలు బీదతనంలో మునిగివున్నవి. ఆ గ్రామాల పునరుద్ధరణకు పూనుకొంటేనేగాని భారతదేశానికి నిజమైన స్వరాజ్యం ప్రాప్తించినట్లుగాదని గాంధీజీ స్పష్టంగా నిర్వచించివున్నారు. విదేశీ పరిపాలనలో గ్రామవ్యవస్థ చిన్నాభిన్నమైనది. ప్రజల దృష్టి నగరాలవైపుకు ప్రసరిస్తున్నది. గ్రామాలలో బ్రతుకుతెరువు లేక ప్రజలు నగరాలవైపుకు పరుగెత్తుతున్నారు. నగరాలలో వున్న సౌకర్యాలు కూడా అంతంతమాత్రమే. అయినా ఏ రిక్షాను నడిపించో, ఏ కూలి నాలి చేసుకునో బ్రతుకును వెళ్ళదీయడానికి జనం నగరాలకు వలస వెళ్లుతున్నారు. దానితో అనేకమైన సమస్యలు ఉత్పన్నమవుతున్నవి. అందువల్లనే గాంధీజీ గ్రామ పరిశ్రమలకు చేయూతనివ్వడ మవసరమనీ, గ్రామ స్వరాజ్యానికి తోడ్పడటం ముఖ్యమనీ భావించి తదనుగుణ్యంగా నిర్మాణ కార్యక్రమాంశాలను రూపొందించారు. అందుకు పలు సంస్థలను ప్రారంభించారు. సత్యాహింసలపై ఆధారపడిన ఒక జీవిత విధానాన్ని, లక్ష్యాన్ని జాతి ముందుంచారు. స్వయంశక్తిపై ఆధారపడమని సెలవిచ్చారు. తన కాళ్ళమీద తాను నిలబడగలిగిననాడే దేశం పురోగతిని సాధించగలదని ప్రబోధించారు. విధానాల తొట్రుబాటులో, లక్ష్య సాధనకు అనువైన మార్గాలను అనుసరించలేకపోవడంతో, ఆర్థిక సూత్రాల అసమంజస నిర్వచనాలతో సుస్థిరమైన విధానాన్ని భారతదేశం అనుసరించలేకపోతున్నది. వికాసశీలమైన దేశంలో ఈ స్థితి కలగడం సహజమేమో తెలియదు. అయినా జాతి పురోగమించక తప్పదు. దానికి సుస్థిరమైన విధానాన్ని అనుసరించక తప్పదు. మన స్థితినీ, వాతావరణాన్నీ, దేశ ప్రజల మనోభావాలనూ విస్మరించడానికి వీలు లేదు. ఎంత తీవ్రంగా ఆలోచించినా మన

దేశ పరిస్థితికి గాంధీజీ ఉపదేశించిన మార్గమే అనువైనదని విశ్వాసం కలగక తప్పదు. ఈనాడున్న మన దేశ వాతావరణాన్ని చూస్తే ఆ విశ్వాసం ఇంకా దృఢపడుతున్నది. కేంద్ర ప్రభుత్వం ఈ మధ్య ఆ రకమైన ఆలోచనలో పడినట్లు, అందుకు తగిన కార్యక్రమాన్ని గురించి ఆలోచిస్తున్నట్లు కన్పిస్తున్నది. అయినా జరుగవలసిన పని జరగడంలేదు. విధ్వంసక శక్తులూ, హింసా ప్రవృత్తీ, స్వార్థపూరిత వాతావరణమూ పెరగడం వలన మానవతా విలువల ముందు ప్రశ్న చిహ్నం ఏర్పడుతున్నది. సాధన పవిత్రతవైపు దృష్టి లేనేలేదు. భాషాగతంగా, జాతిగతంగా, ప్రాంతీయతాదృష్టిగతంగా విభేధాలు సృష్టించి పబ్బం గడుపుకొనే కుహనా రాజకీయవాదుల సంఖ్య పెరిగిపోతున్నది. అధికారంలోకి రావడానికి కొన్ని యోగ్యతలు ఇదివరలో అవసరంగా వుండేవి. ఇప్పుడవిగూడా లేవు. అందరూ మంత్రులు కాదగినవారేనను భావం ఆచరణలో పెరుగుతున్నది. పరమ పునీతమైన ఈ గాంధీ జయంతి సందర్భంలో గాంధీజీ ఆశించిన మార్గంలో నైతిక విలువలకు ప్రాధాన్యమిస్తూ, సాధన పవిత్రతకు సంపూర్ణంగా అంకితులమై, గాంధీజీ ఆశించిన స్వరాజ్య, సురాజ్యపథంలో దృఢసంకల్పంతో ముందుకు సాగగలమనీ, మన దేశ సంస్కృతికి అనుగుణ్యమైన మార్గంలో దేశ సౌభాగ్యానికి తోడ్పడగలమనీ ప్రతినబూనడం మన కర్తవ్యం. ఆనాడే జాతిపితకు తగిన వారసులం మనం కాగలము. గ్రామ ప్రధానమైన భారతదేశ పురోభివృద్ధికి తోడ్పడగలము.

సాహిత్య వీథి

# వ్యక్తిత్వం - దళిత స్పందనం

ప్రొఫెసర్ మాదిరాజు రంగారావు

రస హృదయంతో మానవీయమైన విలువల్ని భావింపజేసేది జాషువా కవిత్వం. వ్యక్తిగతమైన దుస్థితి నుండి సమాజపరమైన అసమాన గతుల దాక వివిధ శక్తుల సంచలనంతో ఈయన రచనల్లో వస్తువు విశ్వభావన వైపు ఉన్ముఖమైంది. యాభై అరవై ఏండ్ల క్రితం దేశంలో నెలకొన్న స్థితి వేరు. ఈ నాటితో పోలిస్తే చాలా వెనుక బడిన దాని క్రిందే లెక్క. తన చుట్టూ నిరాకృతులూ దూరీకృతులూ అయిన కొందరూ, దీనులూ వంచితులూ అయిన మరి కొందరూ ముఖ్యంగా దళితులూ వస్తువుకు కేంద్ర స్థానాలుగా ఉన్నారు. ఈ అభాగ్య దరిద్ర సమూహాల పట్ల సానుభూతి కనబరచడంతో ఆగిపోకుండా, వాళ్ళ బాధలతో కష్టాలతో ఒకటై వాళ్ల పక్షం వహించే కవి బాధ్యత అనితరమైంది. కరుణ హృదయంతో, వేదనా స్పందనతో సాహిత్య ప్రపంచంలో హతాశుల సమస్యల్ని అవగతం చేసుకుని ప్రతిస్పందించిన ఏకవీరుడు జాషువా. దీనులపట్ల తిరస్కృతుల పట్ల వంచితుల పట్ల కవి ఆత్మీయత ప్రతిఫలిస్తుంది.

ఫిరదౌసి, గబ్బిలం మొదలైన కృతుల్లోను ఇతర ఖండికల్లోను, వస్తువు ఎన్నికలో, దాని నిర్వహణలో, ఏర్పరచుకొన్న లక్ష్యంలో ఈ అంశాన్ని స్పష్టంగా చూడవచ్చు. ఈ కారణంగా ఈనాడు ప్రచలితంగా ఉన్న దళిత స్పందనం, ఈయన కవిత్వ వ్యక్తిత్వ స్ఫూర్తిలో భాగంగా గోచరిస్తుంది. ఇది ఉపేక్షించడానికి వీలులేంది, ప్రధానమైంది. ఇది ఈయన కవిత్వ పరిధిని పెంచుతూంది. కాలం గడిచే కొద్దీ కొత్త కొత్త భావజాలానికి ఆస్కారంగా విలసిల్లడం గొప్ప రచనల ప్రత్యేకత. ఈయన రచనల్లో సామాజిక పురోగమన తత్త్వం పోనుపోను సందర్భాన్ని అన్వయ గుణంతో ఆకర్షించడం సహజంగా ప్రాప్తించింది. ఇది అంటే దళిత స్పృహ ఈయన కవిత్వంలో ఆధునికమైన శక్తి పరిధిని పెంచుతూంది. సామాజికమైన బాధ్యతను తలపింపజేస్తూంది.

ఈ దృష్టితో చూస్తే జాషువా రచనల్లో గబ్బిలం హృదయ స్థానీయమైంది. ఇది కన్నీటితో స్విన్నమైన సృజన రూపం. భరతమాత కడగొట్టు బిడ్డ ఒక పరమ దరిద్రుని నికృష్టమైన జీవిత చిత్రణంతో దీన హీన దళిత ప్రపంచానికి ప్రాతినిధ్యం వహిస్తోంది. అతడు కైలాస వాసికి పంపే సందేశం ఒక కరుణ తరంగం. వాస్తవమైన గతి శీలం కలిగింది. గబ్బిలం అక్కడికి వెళ్ళే వరకూ, అనేకమైన చారిత్రక సామాజిక స్థితిగతులు చిత్ర పరంపరవలె క్రమిస్తాయి. ప్రస్తుత సామాజిక వ్యవస్థలో నెలకొన్న ఆర్థికమైన విషయ గతులూ, వాటి పరిమితులూ ఏ విధంగా నికృష్టమైన దశకు దారితీసేది మన దృష్టికి వస్తుంది. ఈ భౌతికమైన రూపం వెనుక నుండి, కరుణాత్మకమైన మనోరూపం దీన హీన జీవితాల అంచుల్లో నుండి ఉద్గమించింది. ఈ స్పర్శతో జాషువా కవిత్వానికి ఒక ప్రత్యేకత సిద్ధించింది.

"నాదు కన్నీటి కథ సమన్వయము సేయ
ఆర్ద్ర హృదయమ్ము కూడ కొంతవసరమ్ము"

సమాజంలో భౌతికతలంపై ఆర్థికశక్తుల ప్రాబల్యమూ, వాటి విపరీత ధోరణులూ, దోపిడీలూ వాటి దుష్పరిణామాలూ అట్లా ఉంచి, వైయక్తికమైన ఆర్ద్రత ఏట్లా లోపించిందీ, హృదయానుబంధం ఎట్లా కొరవడిందీ, తెగిపోయిందీ మనసులో మెదలుతుంది. ఈ కారణంగా

ప్రజల్లో కొన్ని నమూహాలకు నమూహాలు విదళితులయ్యారు. తిరస్కృతులయ్యారు. దూరభావాన్ని పొందారు. వీరిలో కొందరికి గబ్బిలాలు నివసించే స్థానమూ ఆవాస యోగ్యమైంది. వీరి పట్ల కవి హృదయం వ్యక్తిగత సానుభూతితో పాటు, సమాజ గతమైన ప్రేమనూ ఆకాంక్షిస్తోంది.

జీవితంలో అనేకమైన అనుభవ పరంపరలతో పీడిత దళిత ప్రజల పక్షం వహించిన ఈ కవిలో శ్రమశక్తిని గురించి శ్రామిక జీవితాన్ని గురించి కన్పించే అవగాహన దళిత స్పృహను తలపిస్తోంది. కవిత్వ లక్ష్యాన్ని నిర్దేశిస్తోంది. దీని సీమల్ని పెంచుతూంది. హేతు దృష్టికి పదునూ వెలుగునూ ఇస్తోంది.

"వాని రెక్కల కష్టమ్ము లేనినాడు సస్య రమ పండి పులకింప సంశయించు. వాడు, చమ్మట లోడ్చి ప్రపంచము నకు భోజనము పెట్టు వానికి భుక్తి లేదు"

శ్రమ చేసే శక్తులు ఒకవైపూ, ఆ శ్రమ ఫలాన్ని ఆరగించే శక్తులు మరోవైపూ, ఇరువురి మధ్య పెద్ద అఖాతం! ఎన్నో శతాబ్దాలుగా ఉంది. పూడ్చరానిదిగా ఏర్పడింది! శ్రమ శక్తి కొల్ల గొట్టబడుతూన్న యధార్ధ జీవన స్థితిగతులు చిత్రితమైనాయి. పంట పండించే చేతులు, శూన్యంగానే మిగిలి పోయాయి.

॥ఈ అభాగ్యుల రక్తమ్ము నాహరించి ఇనుప గజ్జెల తల్లి జీవనము సేయు"

కష్టాలతో మ్రగ్గే దరిద్ర జీవిత రూపానికి ఇనుప గజ్జెల తల్లి సంకేతింప బడింది.

సమాజంలో చారిత్రకంగా ఏర్పడ్డ ఈ వ్యత్యాసం కాలం గడిచే కొద్దీ పెరుగుతూనే పోయింది. అప్పుడప్పుడూ ఎందరో అభయ ముద్రలతో ఊరడించే పలుకులతో వచ్చారు, వెళ్ళారు. బుద్ధుడూ ఇటీవల మహాత్ముడూ ఏదో కొంత సరి చేసే ప్రయత్నం చేశారు. అయితే మార్క్సిజం ప్రవేశంతో, సైద్ధాంతికంగా వ్యవస్థా పరంగా మూల రూపంలో మార్పుల కారణంగా పరిష్కార మార్గానికి విస్తృతమైన అవకాశాలు లభించినట్లనిపించింది. సంపూర్ణ విజయం ఇంకా దూరదూరంలోనే ఉంది. ఇక్కడ ఖండ ఖండంగా కొంత జరిగింది కాని ఇది సరిపోదు. అన్ని రంగాల్లో మార్పుకు సంబంధించిన స్పృహనూ వాతావరణాన్నీ నిర్మించిందనే మాట వాస్తవం. ఆకలి తీరని, కనీసం అవసరాలు నెరవేరని బ్రతుకులతో మ్రగ్గే వారు, సమయ సందర్భాల్ని బట్టి పీడితులుగానూ దళితులుగానూ ఆలోచనలో నిలిచే మూల రూపం ఒకటే!

"వాని తలమీద పులిమిన పంకిలమ్ము
కడిగి కరుణింప లేదయ్యె గగన గంగ"

ఈ దేశంలో అతి పవిత్రమైన గంగా జలం కూడా శుభ్రపరచలేని పంకిలం ఉంది. అది అభాగ్యుల తలపైనే నిలిచింది. ఆధ్యాత్మిక చింతనతో పూతమైన వాతావరణం లోనూ అస్పృశ్యత ఒక కళంకం వలె జాతి జీవితంలో మిగిలే ఉంది. ఇది చరిత్రలో దయనీయమైంది సమగ్రతను భంగం చేసే విధంగా పరిణమించింది. సంపూర్ణతను కుంఠితం చేసే విధంగా తయారైంది. ఇది ఉజ్వలమైన భారతీయ సంస్కృతీబింబంలో బాధించే చీకటి ముద్ద! ఈ మచ్చవంటి చీకటి తొలగి పోవాలి. వెలుగుతో తళతళ లాడాలి. పూర్ణబింబంలో ఒకటై పోవాలి. ఈ మహా ప్రయత్నానికి మహాకవి కోరేది, సానుభూతి, సహనం, స్నేహం మాత్రమే. జాషువా కవిత్వంలో మానవ ప్రేమ-సమాజంలో సమత-హృదయంలో ధ్వనిస్తాయి.

సబర్మతి ఆశ్రమంలో గాంధీజీ దర్శనం స్వాతంత్ర్యోద్యమంతో పాటు హరిజనోద్యమాన్నీ ఆకర్షించింది. ఈ కవి హృదయం గాంధీజీ వెలుగు జాడల్ని గుర్తించింది.

"ఎవరీ అర్ధ దిగంబరేశ్వరుడు! మా ఇండ్లన్ ప్రవేశించె" నంటూ సందర్భం వేరైనా సంతోషంతో కవి మనస్సు ఉప్పొంగిపోయింది! ఈ మనస్వి మహాత్ముడు కలలుగన్న "హింసా కాలుష్యము లేని భవిష్య ద్దివ్య సామ్రాజ్యాన్ని" దర్శిస్తాడు. జాషువా వ్యక్తిత్వంలోని ఆలోచనా

రమణీయమైన ఈ స్థితి ఈనాటి సమాజానికి ఆవశ్యకమైంది. దేశ సమైక్య భావన అంతస్సూత్రంగా సాగిన మహాకవి రచనోద్యమం నిర్మాణాత్మకమైందే కాక అభాగ్య జగతికీ దళిత ప్రగతికీ ప్రేరకమైంది.

నవ్య సంప్రదాయ కవుల నుండీ మరియు భావకవుల నుండీ పృథఃకరింపబడిన జాషువా కవితా వ్యక్తిత్వం స్ఫుటంగా మన దృష్టికి వస్తుంది. ఇది వివిధ స్థాయిల్లో విద్యావంతుల్ని ఆకర్షించింది. సమాజ స్థితి గతుల్ని గురించి ఒక్కమారు పునరాలోచనకు గురి చేసింది. అశేష ప్రచార బంధురమై భావ కవుల కీర్తి శిఖరాల్ని జాషువా ఉజ్వలమైన యశోబింబం కప్పేసింది. మరీ ముఖ్యంగా ఆ కాలంలో ఆధునికుల్లో తెలుగు కవిత్వం పట్ల అభిలాషను నిలిపింది. అభిమానాన్ని పెంపొందించింది. చారిత్రకంగానూ ఆంగ్ల విద్యా ప్రభావంతోనూ హేతు దృక్పథం చేత ఏర్పడిన సంస్కరణ పథంలో పరివర్తన కోరే కొత్త వాతావరణాన్ని వికసింప జేసింది. ఆ కాలంలో జాషువా కవిత్వం సామాజిక తలంపుగా ప్రముఖమైన పాత్రను నిర్వర్తించినదనే చెప్పాలి.

సంప్రదాయ మార్గంలో పరిక్షుణ్ణమైన పద్యాన్ని ఆధునిక భావ ముద్రతో, అభివ్యక్తి సౌందర్యంతో ప్రజల నాల్కలపై నర్తింపజేసిన శిల్పి (జాషువా). పద్య ప్రపంచంలో ప్రగతి భావాల్ని ప్రవేశ పెట్టి విజయాన్ని సాధించిన కీర్తి ఈయనదే. ఈ ప్రయత్నం పద్యంతో ఏర్పడిన బంధాన్ని దృఢతరం చేసింది. అంతేకాక హృదయాకర్షణీయమైన స్థానంలో నిలిపిన మాట వాస్తవం. అటు శైలీ సమ్మోహనంతో సంప్రదాయ నిరతుల ఆమోద ముద్రను పొందింది. ఇటు అభాగ్యుల జీవితాన్ని వస్తువుగా చేసుకొని ఆధునికుల అభిమానాన్ని చూరగొంది.

దీన్ని సమాలోచనం చేస్తే సంప్రదాయం పట్ల అభిమతితో, సంస్కరణ దృక్పథంతో పరివర్తన లక్ష్యంతో ఆయన వ్యక్తిత్వం రూపొందినట్లు కన్పిస్తుంది. విశ్వజనీన రేఖల్ని సంతరించుకుంది. ఇది కుల మతాల కతీతమైన స్థాయిలో, సార్వజనీనమైన సమాజ శ్రేయోభావనతో పరిణతమైందిగా కన్పిస్తుంది.

"విశ్వమానవ గోత్రేయ వీరులైన
కవులకున్ కర్మ బంధాలు కట్టిపెట్టి
పులుముచుందురు తల మీద కులమురంగు
తొలగిపోవదు లక్ష సబ్బులకునైన

జాషువా జీవితంలో .తటస్థపడిన కొన్ని విచిత్ర సంఘటనలు అతని వ్యక్తిత్వంపై ప్రభావాన్ని నెరపాయి. వాటిలో ఒకటి కులం పేరుతో ఎదురైన అనుభవం. తిరస్కారానికీ అవమానానికీ గురి చేసింది. ఈ స్థితి ఇతనిలో వేదనా శిఖల్ని రగిల్చింది. హృదయం బాధతో పరితప్తమైంది. ఇంటి ముఖం పట్టాడు. ఇంట్లో తిక్కన మహా భారతాన్ని శాంతంగా పఠించడం మొదలు పెట్టాడు. మనస్వియైన జాషువా, వ్యర్థమైన విజల్పనలతో కాలం గడిపే కన్నా సార్థకమైన సాహిత్య వ్యాసంగాని కుపక్రమించాడు. ఈ సద్భావన క్రమంగా మనః పరిణతికి దారి తీసింది. అతనిలో సంకల్పం దృఢతరమైంది. ప్రతిభ నవనవోన్మేషంగా విజృంభించింది. శక్తి ప్రవాహానికి గమనం సిద్ధించింది. ఒక దారి ఏర్పడింది. వేదనాభరితమైన కవిత్వం ఉత్తమ స్థాయి నందుకుంది. స్వయం కృషిపైనే ప్రయాణం సాగించింది. ఇంకా అవమానితులూ తిరస్కృతులూ దళితులూ వొడ్డున నిలబడే ఉన్నారు. వీరంతా ఈయన ఆలోచనా ప్రపంచంలో తిరిగిన వారే!

ఒక సందర్భంలో "గవ్వకు సాటిరాని పలు గాకుల మూక లుపేక్షసేసిన న్నెవ్విధి దూరినన్ను వరించిన శారద లేచిపోవునే, ఇవ్వసుధా స్థలిన్ పొడమరే రసలుబ్ధులు గంట మూనెదన్ రవ్వలు రాల్చెదన్ రవ రవల్ సవరించెద ఆంధ్ర వాణికిన్

తన ప్రతిభచేత, సంస్కారం చేత వరించిన శారద అల్ప మనస్కుల ఆగడాలకు తన హృదయం నుండి నిష్క్రమించదు. విపరీతవాదుల కుండే విలువ అంతంత మాత్రమే! రసలుబ్ధులైన సహృదయులే దీనికి ప్రమాణం!

అతని ఆ ఆత్మ ప్రత్యయం కవితా వ్యక్తిత్వానికి వెన్నెముక వలె పని చేసింది. విద్యా శక్తికి దేశ కాలాలతో పనిలేదు. కులమతాలతో ప్రసక్తిలేదు. వెలుక్కి అంటరానితనం లేదు. ప్రతిభకు అందనిది ఉండదు. ఏవేవో స్వల్ప కారణాల్ని గురించి పట్టించుకోకుండా తానేదో వేరుగాగాక, భారత జాతి జీవన సంస్కృతిలో భాగంగా, తనవంతు బాధ్యతల్ని ఉజ్వలంగా నిర్వహించిన మనీషి జాషువా.

ఈ మనీషి వ్యక్తిత్వంలో అసహనం కోపం ద్వేషం మొదలైన వికార గుణాలకు బదులు సహనం సానుభూతి స్నేహం చోటుచేసుకున్నాయి. ఇవి హేతు సహితమై మానవతారంగంతో ఆలోచనా రమణీయంగానూ కన్పిస్తాయి. వేదనా తప్తమైన హృదయం నుండి మహితమైన హిరణ్మయ వ్యక్తిత్వం ఆవిష్కృతమైంది. ఇది రచనా స్వరూపానికి జీవ ధాతువైంది. దళిత స్పందనం మొత్తం మీద సామాజిక స్పృహలో భాగమైంది. జాషువా రచనల్లో సంవేదన రసావిష్కారం రచనా శిల్పం మొదలైన కవిత్వ కళకు సంబంధించిన అంశాలు వేరు. ఈ అంశాలన్నిటికీ కేంద్రం, హిరణ్మయ వ్యక్తిత్వమే. ఇది ఆలంబనంగా పనిచేసింది. పుటపాక ప్రతీకాశమైంది. తెలుగు భాష ఉన్నంతవరకూ జాషువాను మహాకవిగా నిలుపుతుంది.

జీవితంలో ప్రాప్తమైన అనుభవ పరిణతి క్రమక్రమంగా హేతుబలంతో నిర్మాణాత్మకమైన ప్రతి క్రియకు దారితీసింది. ఇది మౌలికమైన ఆత్మ రూపాన్ని ప్రకాశమానం చేసింది. జాగ్రత్తగా పరిశీలిస్తే సాహిత్య ప్రయోజనాన్ని, తత్కాలమైన ఆవేశంతో ఏర్పడిన సంకుచిత పరిధుల నుండి బయట పడేసింది. రచనలో సామాజిక స్పృహకు గాఢత్వాన్ని ప్రసాదించింది. అట్టడుగున ఉన్న దళిత ప్రజలకు ప్రేరణగా నిల్చింది. మార్పుకోరే ప్రగతి శక్తులకు బలాన్ని ఇచ్చింది.

చారిత్రకంగా పరిశీలిస్తే "నా కవనం బహింస సహనంబను ఆయుధమున్ ధరించి" అని ఉద్యమించే గాంధీజీ ప్రభావం ఈ కవిపై అనితరంగా ప్రసరించింది. దేశ స్వాతంత్ర్యోద్యమంతో పాటు మహాత్ముని హరిజనోద్యమమూ అతణ్ణి ఆకర్షించింది. సమస్యను వ్యక్తి స్థాయిలో కాక ఆపైస్థాయిలో సమాజ శ్రేయస్సుకై పాటుపడే ఆదర్శంతో నిలిపింది.

"నరుడు చేయలేనిదేమిటన్న" ప్రశ్నలో నిక్షిప్తమైన సమాధానం కొండంత అదృశ్య బలాన్ని ఇచ్చింది.

"అమృతము చిల్కి చింతల నపసయించు
హృదయము గలట్టి నవ రచయితను నేను"

జాషువా కవితా స్వరూపమూ, దాని పరమార్థమూ చారిత్రకమైన పాత్రా గురించి తలెత్తే ప్రశ్నలకు సమాధానం ఉంది.

ఇట్లా ఎన్నో గుణాల సంపుటిచేత ఏ వెనుకబడిన ఆధార సూత్రమూ లేకుండా, ఏ దళిత ముద్రా లేకుండా, ఆధునిక యుగంలో గొప్ప కవుల్లో నిలిచే ప్రతిభామూర్తి జాషువా.

'కలుపుల గోలు తనమ్ము కోలుపడి, ముక్కల్ ముక్కలై,
(హెచ్చుతగ్గుల తత్వాల
మహాపిశాచముల
(ఉక్కుం గోరలంజిక్కి,
శోషిలు మర్త్యత్వము సుద్ధరించి చనియెడ్
(శ్రీ గాంధి రాజర్షి
కాగల హిందూ సఖ! నిల్చు కొమ్మిక!
నిజాంక ప్రాప్త రాజ్యేందిరన్"

స్వాతంత్ర్యం సిద్ధించాక, మహాత్ముడు రంగం నుండి నిష్క్రమించాక ఇదో వార్నింగ్ మాత్రమే!

సర్వమానవ సమానత, మానవత, ప్రగతి తత్వంతో విశ్వజనీన దృక్పథాన్ని విషరిస్తోంది నవయుగ కవి చక్రవర్తి కవిత్వ వ్యక్తిత్వం.

కుల మతాలు గీసుకున్న గీతలం జొచ్చి
పంజరాన కట్టు వడను నేను
నిఖిల లోక మెట్లు నిర్ణయించినగాని
తిరుగులేదు! విశ్వనరుడ నేను!
- ఇవి కవి మాటలు

# చెల్లీ చెంద్రమ్మ - రసశిల్పం

- డా॥ బి. వేంకటేశ్వర్లు

సాహితీ వేత్తలు చాలామంది అభ్యుదయ కవిత్వం పేరుతో అకవిత్వం సాహిత్యంలో చోటుచేసుకుందనీ, వాస్తవానికి భావ కవిత్వం తోటే కవిత్వం సమాప్తమైందనీ చాటుగా నసుగుతూ ఉంటారు. వాళ్లు ఏకొలమానాలతో కొలిచి ఈ నిర్ణయానికి వచ్చారో అర్థం కాదు. అభ్యుదయ కవిత్వానికే ఆ ముద్రవేస్తే తరువాత వచ్చిన విప్లవ కవిత్వం మాటేమిటి? విప్లవ కవిత్వంలో అసలు కవిత్వమనేది ఉందా? అసలు కవిత్వమే ప్రశ్నార్థకమైనప్పుడు శిల్పం, రసం వీటిమాట ఏమిటి?

నేను డిగ్రీ కాలేజీలో తొలుత పాఠాలు చెప్పటం మొదలైనప్పుడు 'నాచెల్లీ చెంద్రమ్మా' - అనే శివసాగర్ కథాకావ్యాన్ని చెప్పవలసి వచ్చింది. ఆ సందర్భంగా విప్లవ కవిత్వాన్ని గూర్చి కూలంకషంగా అధ్యయనం చేశాక, పై ప్రశ్నలు 'గుడ్డివాడు-ఏనుగు'-అనే కథను స్ఫురింపజేశాయి.

విశాలాంధ్రోద్యమం, తెలంగాణా పోరాటం వంటి ఉద్యమాలు ముగిశాక, అభ్యుదయ కవిత్వంలో ఉద్యమదశ తగ్గుముఖం పట్టింది. దిగంబర కవులు తాము వ్రాసింది. వచన కవిత్వం కాదని, అన్నా అది వచన కవిత్వమే అయింది. వాళ్లు ప్రచురించిన తొలి సంపుటాల్లో ప్రస్తుత వ్యవస్థ మీద తీవ్రమైన కసి అభివ్యక్తమైనా, మూడో సంపుటం నాటికిగానీ వాళ్ల రాజకీయ దృక్పథం ఏమిటో స్పష్టం కాలేదు. ఒకరకంగా దిగంబర కవిత్వం విప్లవ కవిత్వానికి పూర్వరంగం అయింది. శ్రీశ్రీ షష్టిపూర్తి నాటికి విప్లవ కవిత్వానికి రూపు రేఖలు ఏర్పడ్డాయి. ఆయన అధ్యక్షతలోనే విరసం (1970) ఆవిర్భవించింది.

శ్రీకాకుళ పోరాటాన్ని సమర్థిస్తూ మార్క్సిజమ్, లెనినిజమ్, మార్గాన్ని అనుసరిస్తూ విప్లవ కవులు 'తిరగబడు', 'లే', 'మార్చ్', 'ఝంఝ'-వంటి వచన కవితా సంపుటాలను ప్రచురించారు. వాటిని ప్రభుత్వం నిషేధించింది. వీటి మీద హైకోర్టు తీర్పునిస్తూ "విప్లవ కవిత్వం ఎంతమాత్రం ప్రమాదకరం కాదు. అది ప్రజలకు బోధపడదు. 1. అని అనటం ఆత్మవిమర్శ కలిగించింది. విప్లవ కవుల్లో చాలా మంది మధ్యతరగతి నుంచి వచ్చిన వాళ్లు కావటం వల్లా, అప్పటి కవిత్వానికి వచన గేయమే ప్రధాన రూపమైనందువల్లా, విప్లవ కవులు వచన గేయంలోనే పుట్టి పెరిగిన వాళ్లు కావటంవల్లా, సామాన్యుడికి కూడా విప్లవ సందేశం చేరాలంటే గేయమే సరైన వాహిక అన్న ఆలోచనకు రాలేక పోయారు. పైగా 'తిరగబడు', 'లే' 'కొట్టు' 'నరుకు', 'దోపిడి', బందూకు వంటి నినాదాలతో కూడిన కవిత్వం జనాన్ని ఆకర్షించలేక పోయింది.

ఇక్కడ ఒక విషయాన్ని చెప్పాలి. శ్రీశ్రీ షష్టిపూర్తి నాటికే 'సుబ్బారావు పాణిగ్రాహి'-'జముకులకథ' అనే ప్రక్రియతో పాటను ఈటెగా చేసుకొని శ్రీకాకుళం అడవుల్లో విప్లవ కార్చిచ్చును రగిలించిన ఘనత సంపాదించాడు. ఆ విప్లవ వీరుని స్మృతికి 'ఝంఝ' అనే కవితా సంకలనాన్ని అంకితమిచ్చిన విప్లవ కవులు ఆయన బాటే ఆదర్శమైందని భావించారు. అంటే 'పాటే విప్లవానికి బాట'-అని తెలుసుకున్నారు. 'ఝంఝ' రెండు నెలలకే రెండో ముద్రణ పొందింది. దానికి కొనమాట వ్రాస్తూ శ్రీశ్రీ

ఎస్.కె.ఆర్.బి.ఆర్. కాలేజి, నరసరావుపేట.

ఒకమాట అన్నాడు. ఏమంటే నూటికి 75 శాతం నిరక్షరాస్యులుగా ఉన్న వారికి ఎలాంటి సాహిత్యాన్ని అందజేయాలన్నదే విరసం పరిష్కరించుకోవాల్సిన సమస్య అన్నాడు. 'ఝుంఝు' కవితా సంకలనంలో శివసాగర్ వ్రాసిన 'నరుడో భాస్కరుడో'-అన్నపాట, శ్రీశ్రీ విశాఖ మాండలికంలో వ్రాసిన 'నిన్నటి జట్కావాలా'-అనే వచన గేయం విప్లవ కవుల్ని బాగా ఆకర్షించింది. గేయంలో విప్లవ కవిత్వాన్ని తొలుత పలికింది పాణి గ్రాహి అయితే విప్లవ కవిత్వాన్ని గేయం వైపుకు తిప్పిన మొదటిపాట 'నరుడో భాస్కరుడో' అయింది. తమ రణానికి గేయవరణమే సరైందని వి.ర.సం. కవులు భావించారు. వచన కవిత్వం ఒక వెల్లువలా వచ్చాక ఉద్యమోత్తేజాన్ని కోల్పోయిన గేయం కొత్త జీవం పోసుకొని పాటగా పరిణమించింది. విప్లవ కవిత్వం చాలా వరకు పాటలోనే వచ్చింది. జానపద గేయాల ధోణిలో సాగిన తరువాతనే విప్లవ కవిత్వానికి వేగం పెరిగిందనటం సబబుగా ఉంటుందేమో!

శ్రీశ్రీ షష్టిపూర్తికి ముందే, అంటే విప్లవ కవిత్వానికి విస్పష్టమైన రూపురేఖ లేర్పడక ముందు ముప్పై మంది యువకులు శ్రీశ్రీని ఇంటర్వ్యూ చేసిన సందర్భంలో ఒక యువకుడు 'వచన కవిత' యొక్క తరువాత రూప మేమిటి? మళ్లీ మాత్రా ఛందస్సుల్లోకి వెళ్లుతుందా? అని అడిగిన ప్రశ్నకు సమాధానంగా శ్రీశ్రీ ఇలా అన్నాడు. "వచన కవిత ఉంటుంది. జానపద బాణిలో ఎక్కువ కృషి చేయటం జరుగుతుంది. మాండలికపు నుడికారం వస్తుంది. విషయానికి సంబధించినంతవరకు సామాజిక జీవితం ఇంకా విస్పష్టంగా ప్రతిబింబిస్తుంది. (సృజన-14, ఫిబ్రవరి 1970, పు 143.) ఈ మాటలు అక్షరాలా నిజమైనాయి.

ఈనాడు వస్తున్న విప్లవ కవిత్వం చాలా వరకు మాండలిక నుడికారంతో, జానపద గేయాల బాణీలో ఉన్నదే ఎక్కువ. వస్తు వైవిధ్యంతోపాటు వైశాల్యం కూడ పెరిగింది. 'జన చైతన్నమే విప్లవాలకు కాంతి' అని విప్లవ కవులు నిశ్చయించి కవిత్వాన్ని రచిస్తున్నారు. విప్లవ కవిత్వంలో ఖండికా రచనలేగాక కథా కావ్యాలు, నాటికలు మొదలగు జానపద కళారూపాలు తిరిగి జీవం పోసుకున్నాయి. ఇంతటి ప్రక్రియా వైవిధ్యానికి కారణం విప్లవ కవులు తమ కవితావేశానికి గేయాన్ని వాహికగా చేసుకోవటమే. పాటకు ప్రాధాన్యం రావటం వల్లనే 'చెల్లీ చెంద్రమ్మా' వంటి కథా కావ్యాలు, భూమి భాగోతం వంటి నాటికలు రావటానికి వీలు కలిగింది.

శిల్ప దృష్ట్యాగాని, రసదృష్ట్యాగాని మరే దృష్టితో చూచినా 'నాచెల్లీ చెంద్రమ్మా' ఉత్తమ కావ్య పంక్తిలో చేరుతుంది. సంప్రదాయ కావ్యాలకు ఏమాత్రం తీసిపోదు. పాటలో ఒక జీవితాన్ని సమగ్రంగా చిత్రించటం అరుదైన విషయం. సార్థకమైన ప్రయోగం ఇది.

కథ : చెంద్రమ్మ, మొగిలి-అనే ఇద్దరిది కన్నుల పంటైన జంట. ఆ పల్లెలోనే కాసిరెడ్డి అనే భూస్వామి ఉన్నాడు. వాడు నిష్కారణంగా ఏదో సాకుపెట్టి మొగిలిని గుంజకు కట్టి కొట్టిస్తే మరణిస్తాడు. రెడ్డి ఒంటరిగా తారసిల్లిన చెంద్రి శీలాన్ని కాటు వేయబోతాడు. చెంద్రి కత్తితో పగతీర్చుకుంటుంది. చివరికి కొండదాటి, ఏరుదాటి అడవిలోని అన్నల్ని కలుసుకోవటానికి వెళ్తుంది. - ఇది కథ.

కథనం : సాదాసీ దాగానే కథ చెప్పుకొని పోతున్నట్లనిపిస్తుంది. కాని తెలియకుండానే కళ్ల వెంట నీళ్లు కారుతాయి. ఇది పూర్ణమ్మ కథను చదివేటప్పుడు పొందే అనుభూతిలాగే ఉంటుంది. ఈ కథలో ఎక్కడా విప్లవ ప్రబోధం లేదు. విప్లవకవిత్వంలో కనిపించే విప్లవ పరిభాష రెచ్చగొట్టే ధోరణి కనిపించవు.

"ఊరికి పులిగాని, గొడ్డలికి పులి గాదు
దోపిడికి దొరగాని, కత్తికి దొరగాదు" - అని అన్న

పంక్తులలో మాత్రమే విప్లవ ప్రబోధం రేఖా మాత్రంగా కనిపిస్తుంది. అయినా గంభీరమైన ఆ సన్నివేశంలో అవి సహజ సిద్ధంగానే ఉన్నాయి.

"కొండకు ఆవల కారడవి ఉన్నాది
కొండకు ఈవల ఏరొకటి ఉన్నాది
ఏరుకు పక్కాన పల్లొకటి ఉన్నాది
ఆపల్లెలో ఉన్నాది చెల్లీ చెంద్రమ్మా"

- అంటూ ఆరంభమైన కథ,

చెంద్రి ఏరుదాటి, కొండదాటి అడవిలోకి వెళ్లటంతో ముగుస్తుంది. ఈ విధంగా ఆరంభానికి, ముగింపుకు ఒక ఐక్యత కనిపిస్తుంది.

రసం : ఇందులో అంగిరసం దీరం. కాసిరెడ్డిని చంపుతానని చెంద్రి బాస చేయటంలోనూ, వాణ్ణి చంపి విప్లవ మార్గంలో సాగటంలోనూ దీరం కనిపిస్తుంది. మొగిలి మరణంలో శోకం, చెంద్రి దుఃఖాన్ని వర్ణించటంలో కరుణం, కాసిరెడ్డిని కత్తితో పొడిచి కసి తీర్చుకున్న సందర్భంలో చిందిన నెత్తురు బొట్టుగా పెట్టుకునే సందర్భంలోనూ రౌద్ర భీభత్సాలు హృదయాల్ని జలదరింప చేస్తాయి.

గురజాడ పూర్ణమ్మ - శిసాగర్ చెంద్రమ్మ :

శివసాగర్ వ్రాసిన ఈ '' చెల్లీ చెంద్రమ్మ'' పాటను ఎత్తుగడపై గురజాడ 'పూర్ణమ్మ'-గేయం ఎత్తుగడ ప్రభావం కనిపిస్తుంది. పూర్ణమ్మ గేయంలో

కొండల నడుమను కోనొకటున్నది
కోనకి నడమా కొలనొకటున్నది
కొలని గట్టునా కోవెల లోపల
వెలసెను బంగరు దుర్గమ్మ - అనే పంక్తులు
కొండకు ఆవల కారడవి వున్నాది
కొండకు ఈవల ఏరొకటి వున్నాది
ఏరుకు పక్కన పల్లొకటి వున్నాది
పల్లెలో వున్నాది చెల్లీ చెంద్రమ్మా-ఈ పంక్తులు చదివినప్పుడు స్ఫురణకు వస్తాయి. ఎత్తుగడలో, కథా కథనంలో కొన్నిచోట్ల ురజాడ ప్రభావం కనిపించినా ముగింపులో మాత్రం గురజాడ కనిపించడు. 'పూర్ణమ్మ' విషాదాదంతం. చెంద్రమ్మ విషాదాంతం కాదు. విప్లవ మార్గాన్ని ఎంచుకొంటుంది. గురజాడ పూర్ణమ్మలో సమస్యా చిత్రణముంది. కళాదృష్టి ఉంది. సమస్యపట్ల పాఠకుల సానుభూతి సాధించి ఆలోచింప చేయటం గురజాడ ఉద్దేశ్యం. అయితే చెంద్రమ్మలో ఒక పరిష్కార మార్గం ఉంది. కాసిరెడ్డి మరణించాడు కదా! ఆ ఊరిపీడ విరగడై తనకసి తీరింది గదా! మరి చెంద్రమ్మ అన్నల్ని ఎందుకు చేరినట్లు? అంటే వ్యక్తుల మరణంతో కాదు, ఆ వ్యవస్థ అంతరిస్తే కాని మార్పురాదు - అనేది ఈ కావ్యంలో ధ్వనిస్తుంది. ఇలా గురజాడతో సామ్యవైషమ్యాలు కనిపిస్తాయి.

చెంద్రమ్మ - జానపద సంప్రదాయం :

ఈ కావ్యాన్ని జానపదగేయబాణీని, జానపద సంప్రదాయాన్ని అనుసరించి వ్రాయటం జరిగింది. అందుకు అడుగడుగునా సాక్ష్యం కనిపిస్తుంది.

'కాసిరెడ్డికి కలవు నూర్ల ఎకరాలు
కాసిరెడ్డికి కలవు బార్ల మేడల్లు
కాసిరెడ్డికి కలవు వేనూర్ల గోవుల్లు'

ఈ పాదాలలోని పునరుక్తి జానపదగేయరీతికి చెందినదే. అలాగే

'ఆలమందలు కాయ ఆవగింజ యిచ్చు
నూతుల్లు తవ్వంగ నువ్వు గింజిచ్చు
కాల్వల్లు తవ్వంగ కాశిగడ్డి యిచ్చు
దుక్కుల్లు దున్నంగ దుబ్బుగడ్డి యిచ్చు
పంటపండించంగ పెరిగి పంచి యిచ్చు'

ఈ మొదలైన పాదాలలో ఒకేరకమైన భావం వరుసగా పునరుక్తి కావటం, వ్యక్తీకరణ పద్ధతి, జానపదగేయ సంప్రదాయమే. అయితే ఇక్కడ ఒక విషయాన్ని చెప్పాలి. సాధారణంగా జానపదగేయంలో సరళంగా, సూటిగా చెప్పటమే ఉంటుందిగాని శిల్పం ఉండదు. అయితే ఈ కథాకావ్యంలో శిల్పం అన్వర్థమైనది. 'ఏటిపాట కొండ సిగను చేరింది'. అన్నప్పుడు ఎంతో ఉత్తమ నిర్మాణ శిల్పాన్ని అనుసరించి రచించటం జరిగింది. ఈ పాదంలోని ధ్వని లిఖిత సంప్రదాయానికి చెందింది. గురజాడ పూర్ణమ్మ

కంటే కూడ మిన్నగా శిల్పాన్ని ఎలా పాటించాడో పైన పేర్కొన్నాను. కేవల జానపదగేయం ఇంతటి నిర్మాణ శిల్పాన్ని కోరదు. అందువల్ల ఈ కావ్యంలో జానపదగేయ సంప్రదాయరీతి, లిఖిత కవితా సంప్రదాయరీతి కలసి ఉన్నాయి. ఈ కథా కావ్యాన్ని కవి జానపదగేయాల ఒరవడిలో వ్రాసినా, తాను జానపదకవి కాకపోవడం వల్ల జాగరూకుడైన కళాకారుడు కావటం వలన (లిఖిత సంప్రదాయ కావ్య శిల్పమర్మాలు తెలిసినవాడు కావటం వల్ల) లిఖిత సంప్రదాయరీతి కూడ చోటు చేసుకుంది.

భాష : సాధారణంగా గేయంలో వ్యావహారిక భాషనే ఎక్కువగా వినియోగిస్తారు. జానపద గేయమైతే చెప్పేదేముంది? ఈ కథాకావ్యంలో వ్యావహారిక భాష నుడికారాన్ని పెండటం కనిపిస్తుంది. 'బెమ్మా దేవుని తోడు' 'చూడా చక్కని జోడు', 'బట్టే బాజీవాడు', 'బట్టతలవాడు' , 'పసిరికపామై బతుకు కాటువేయటం', 'చుక్కపొద్దువేళ' , 'కత్తికోత', 'ఇలలో బత్తెము దీరె', 'బువిలో నూకలు చెల్లె' 'నీ బిడ్డలకు నువు లేవు' 'నా ఉసురు నీ ఉరితాడు' వంటి జాతీయాలు, పదబంధాలు ఈ కావ్యపు జిగిని పెంచాయి.

వర్ణనలు : సాధారణంగా విప్లవ కవిత్వంలో వర్ణనలు, సంప్రదాయ సాహిత్యం చదివిన వాళ్ళకు రచించవు. దానికి కారణం విప్లవ కవిత్వంలో ఉండే వర్ణనలు కూడ ఒక కారణమే. మూసపోసినట్లుండే ఒకే విప్లవ ప్రతీకల్ని ఎన్నుకొని వర్ణన చేయటమే అసలు కారణం. అయితే ఇందులోని వర్ణనలు ఏ సంప్రదాయ కావ్యానికీ తీసిపోక పోవటమే గాక, ఉన్నత ప్రమాణాలలో నిలుస్తాయి. ఉదాహరణకు కాసిరెడ్డి మరణించినరోజు రాత్రి తెల్లవారిన సన్నివేశాన్ని వర్ణించిన తీరుచూస్తే తెలుస్తుంది.

"భళ్ళు భళ్ళుమని తెల్లవారింది
ఎందుకో ఆపొద్దు తెల్లవారింది
గాలి వీచింది, గరికపూచింది
కోడెదూడ మెడలో గంట మోగింది
సారె తిరిగింది, కదురు కదిలింది
రావి చెట్టు కింద కొలిమి మండింది
ఏటి పాట కొండ సిగను చేరింది
అడవిలో అన్నల్ల చెల్లి చేరింది."

ఇందులో 'ఏటిపాట కొండ సిగను చేరింది' అనటం చాలా ఉదాత్తమైన కల్పన, ఏ కృష్ణ శాస్త్రో ఈ పంక్తి చదివినపుడు ఊహలో మెదులుతాడు 'ఎందుకో ఆ పొద్దు తెల్లవారింది' -అన్నపుడు దుష్టుని పీడ విరగడైపోయిందని సూచించడం జరిగింది. ఆ దుష్టుడు మరణించాక 'గాలి వీచింది' అనటంలో గాలి స్వేచ్ఛకు, 'గరిక' సామాన్యుని జీవితానికి సంకేతాలు. అలాగే 'గంట' విప్లవం పిలుపుకు 'సారె', 'కదురు' శ్రమజీవులకు, 'కొలిమి' విప్లవ చైతన్యానికి 'అడవి' -విప్లవ కేంద్రానికి 'ఏటిపాట' చెంద్రికి 'అన్నట్లు' విప్లవ వీరులకు ప్రతీకలు. ప్రతీకను ప్రతిభావంతంగా వాడుకున్న వర్ణనమే సజీవంగా నిలుస్తుంది. విప్లవ కవిత్వంలో ఇలాంటి వర్ణనలు చాలా అరుదుగా కనిపిస్తాయి. మొగిలి మరణించాక, కాసిరెడ్డి చెంద్రికోసం మాటువేసి, సంభాషిస్తూ

'నా ఆశ కాపుకాసె' - అని వ్యక్తీకరించటం, 'మల్లె జిల్లెడాయె' 'వల్లకాడు మనసు' - వంటి ఉపమానాలు 'మీనుకు నక్షత్రాల మిలమిలలు దిగమింగె' - వంటి అమూర్త భావం.

'వాన కురియంగ, ఏరు పారంగ
చీకటిపై, చినుకులపై తెప్పతేలంగ
చీకటితో, చినుకులతో పోరుసేయంగ
పోరుసేయంగ, ఏరుదాటంగ'

- అనే పంక్తులలోని వర్ణన -

ఇవన్నీ ఉత్తమ కవిత్వాన్ని పట్టి చూపే పంక్తులు.

చెంద్రమ్మను ఏరుదాటించిన 'జాలారి జంగయ్య' చెంద్రమ్మ తల్లికి దండాలు పలికి, పలికిన పలుకులు చూడండి.

"నా చేతైన సాయమిదె చెంద్రమ్మ తల్లీ?

వెళ్ళిరావే తల్లి! మళ్ళీ రావమ్మా!
నా బిడ్డకు నీ పేరు పెట్టుకుంటాను
వేయేండ్లు చల్లంగ వర్ధిల్లు తల్లీ!
వెళ్ళిరావే తల్లీ! మళ్ళీ రావమ్మా!
అడవిలో అన్నలకు దండాలు సెప్పు
వెళ్ళిరావే తల్లీ! మళ్ళీ రావమ్మా!''

ఇవి ఏ ఎడదలోతుల నుండి ఎగదోసుకు వచ్చాయో, వాత్సల్యాది ఏఏ రసాలు ముప్పిరిగొన్నాయో వాచ్యంగా వివరించలేం. రామాయణంలో ఏ గుహుడో, ఏ శబరో ఇలా మాటలాడి ఎడదను తడిపేయటం మన అనుభవ సిద్ధమైన విషయం. ఇదుగో అలాంటి సందర్భ శుద్ధితో పులకింపచేసే పలకరింపులు ఈ వీడ్కోలు పంక్తులు.

అలంకారాలు : సాధారణంగా విప్లవ కవులు అలంకారాల పట్ల ఆసక్తినంతగా ప్రదర్శించరు. కానీ ఈ కావ్యంలో సహజ సిద్ధంగా అలంకారాలెలా కుదిరాయో చూస్తే విప్లవ కవిత్వంలో కూడా అలంకారాలు ఇంత హృద్యంగా ఉంటాయా అని అనిపిస్తుంది.

చెంద్రమ్మను లిల్లీ పువ్వుతో, మొగిలిని మొగిలిపువ్వుతో ఉపమించటం, కాసిరెడ్డిని ఉసిరిక నీడల్లో పసిరికపామని, రాకాసి వాడని, కోడెనాగు వాడని, రూపాలంకారాలలో చెప్పటం, చెంద్రి శోకాన్ని, ఏరులై, వరదలై, సంద్రమై ఆకాశాన్ని తాకిందని పరిణామాలం కారంలో చెప్పడం సహజంగా ఉన్నాయి. సంప్రదాయ కావ్యాలలో స్త్రీల నడుమును 'అస్తి నాస్తి విచికిత్సా హేతుశాతోదరిన్' అని ఇలా ఏవో ఏవో చెబుతూ ఉంటారు. కానీ కందిరీగ నడుము వంటి నడుము దానా' - అన్న దానిలోని సొగసు ఎన్ని అలంకారాల బలమైతే వస్తుంది? కాసిరెడ్డి అలా అనటం శివసాగర్ జాన పథ హృదయానికి నికషం. మినుకు నక్షత్రాల మిలమిలలు, కారుమబ్బులు దిగమింగటం, చీకటితో చినుకులతో పోరు చేయటానికే చెంద్రమ్మ ఏరుదాటిందని ఉత్ప్రేక్షించటం, కాసిరెడ్డి రూపాన్ని, రాగిమీనవమువాడని నహజోక్తితో వర్ణించటంలోనూ, కాసిరెడ్డి కుయుక్తికి బలైన మొగలి అడగులు తడబడుతూ, నెత్తుర్లు కారంగ, నెత్తుర్లు కక్కుతూ చావు వెంటరాగా గూడుచేరాడని వర్ణించిన సందర్భంలోనూ సహజాలంకారమే కనిపిస్తుంది.

ఛందస్సు : ఇదొకపాట. జానపద సంప్రదాయంలో లిఖిత సంప్రదాయ కవితారీతి తెలిసిన కవి వ్రాసినపాట. అందువల్లనే ఉభయ సంప్రదాయ కవితా రీతులు పెనవేసుకొని కనిపిస్తాయని పైన పేర్కొన్నాను.

జానపదుల పాటకు సొగసైన నడకే ముఖ్యంగాని లిఖిత సంప్రదాయంలోలాగ, మాత్రలు వాటిపై దృష్టి ఉండదు. సాధారణంగా పాటలో దీర్ఘాక్షరాలమీద ఇంకొక మాత్రాకాలం పెంచటం, దీర్ఘంలేని అక్షరాల మీద కూడ దీర్ఘం పెట్టి సాగతీసి పాడటం మనం చూస్తూ ఉంటాము. అందుకే పదకవిత్వంగానీ, జానపదగీతాలు గానీ పాడినప్పుడే ఆ గీత సౌందర్యం, అందులోని ఛందస్సౌందర్యం అనుభవించ గలము. అలాగాకుండ మామూలుగా చదివితే ఆ సౌందర్యాను భూతి కలుగదు.

'చెల్లీ చంద్రమ్మ' పాట కాబట్టి, రాగం సాగదీయటానికి, విరామానికి వీలుగా అక్కడక్కడా పాదంలో మాత్రలు నిండుగా ఉండవు. అలా పాదంలో మాత్రలు తగ్గించి వ్రాయటానికి కారణం గానంలోని సౌందర్య దృష్టి. ఉదా॥కు 'నా ఆశ కాపు కాసే నీ దాపు నేను వస్తి'.

ఈ పై పంక్తిలో (నా-నీ) మీద ఒక మాత్రాకాలం 'ఊ'ని కలిపితే పాటలో సొగసు వస్తుంది. రెండవ ఆ వృత్తిలో 'కాపుకాసే' అన్నప్పుడు 'సే' అనే దీర్ఘాక్షరాన్ని కుదించి పాడటం జానపదగేయ సంప్రదాయం. ఇలాంటి సొగసులు ఈ పాటలో చాలా ఉన్నాయి.

ఈ పాట సాధారణంగా పాదానికి ఆరేసి మాత్రలతో నాలుగు ఆవృత్తులుండి, త్రిశ్రగతిలో నడుస్తుంది. పైన చెప్పినట్లు పాట కాబట్టి రాగానికి అనుగుణంగా,

విరామానికి వీలుగా మాత్రలు నిండుగా ఉండవు.

"మొగలిని గుంజకు కట్టి కొరడా చేతబట్టి
దెబ్బ మీద దెబ్బ విసిరాడు"

ఇక్కడ అన్ని ఆవృత్తులలో ఆరేసి మాత్రలు లేవు. అయినా ఆరేసి మాత్రలకు కట్టించి పాడతారు. రెండవ పాదాన్ని 'దెబ్బా మీద దెబ్బదెబ్బ విసిరాడు' - అని అన్నీ గరువులుగా సాగదీసి పాడటం వల్ల కొరడా పొడవును వ్యంజించినట్లు, పొడవైన కొరడాతో లాగదీసి కసికసిగా కొడుతున్న దృశ్యం స్ఫురిస్తుంది.

చెంద్రి కత్తి ఎత్తి వొత్తి పొత్తి కడుపులో గుచ్చె'

పాదంలో అన్ని పదాలు 'కడుపు' వరకు మూడేసి మాత్రలకు సమంగా విరుగుతున్నాయి. పాదాంతంలో ఒక మాత్రాకాలం విరామం తీర్పు ఎక్కడా విరామం లేదు. ఈ పాదంలో నిర్విరామంగా ఒక వేగంతో మీద మీద కత్తితో పోటు పొడిచే సన్నివేశం చిత్రించటం కనిపిస్తుంది. 'త్తి' అనే అక్షరావృత్తి వల్ల కాసిరెడ్డి మీద చెంద్రికి గల కసి తెలుస్తుంది. చివర ఒక మాత్రాకాలం విరామం ఎంతో అర్థస్ఫూర్తిని ఇస్తుంది.

"చిటపట చిటపట చినుకులు చిట్లంగ
కాసిరెడ్డి వొల్లు చిటపటాలాడె
పులపుల పులపుల చినుకులు చిందంగ
కాసిరెడ్డి వొల్లు పులకరించంగ"

ఒక్కడ ఒకటి, మూడు పాదాలలోని లఘ్వక్షర బాహుళ్యం, ధ్వన్యనుకరణ పదాలలోని అక్షరాల ఏకాంతరావృత్తి వల్ల చినుకుల స్థితి సూచితం. అంతేకాక అటు ప్రకృతినీ, మనః ప్రవృత్తినీ ప్రతియోగ పద్ధతిలో వర్ణించటం ఇక్కడి విశేషం.

ఇలా ఈ పాటలో ఎన్నో విశేషాలు కనిపిస్తాయి. ఒక పాటలో సమగ్ర జీవితాన్ని కళ్లకు కట్టించి, కలకాలం సాహితీలోకంలో నిలచేలా రూపొందించిన శివసాగర్.



# విశ్వనాథ ప్రయోగ వైలక్షణ్యానికి ఎత్తిన పతాక : చెలియలికట్ట

- ఎస్.ఎస్.రాజు, ఎం.ఏ.ఎం.ఫిల్.

ఆయనను 'అచ్చమైన సంప్రదాయవాది' అంటారు కొందరు "మార్పును అంత సులభంగా అంగీకరించే మనిషి కాందటారు మరికొందరు". 'గతకాలం ప్రతినిధి' గా పేర్కొంటారు ఇంకొందరు. ఇలా ఒక వ్యక్తిని గురించి భిన్నాభిప్రాయాల్ని వ్యక్తం చేసే వారంతా కూడా ఆయన అద్వితీయ ప్రతిభానంపన్నుడనే విషయంలో ఏకాభిప్రాయాన్ని కలిగి ఉండడమే విశేషం. సంప్రదాయంలో ప్రయోగాన్ని మేళవించినా, ప్రయోగానికి సంప్రదాయపు జిలుగులద్దినా ప్రయోజనాన్ని శతశాతం సాధించగల ఆ ప్రతిభామూర్తి కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు.

విశ్వనాథ వారికి ఇది శతజయంతి సంవత్సరం. వందసంవత్సరాల క్రితం కృష్ణాజిల్లా నందమూరులో జన్మించిన శ్రీ విశ్వనాథ సుమారు 19 సంవత్సరాలక్రితం స్వర్గస్థులయ్యారు. ఏభావాన్నైనా నూటిగా, నిర్మొహమాటంగా స్పష్టంగా చెప్పడం తను చెప్పినదానికి తను కట్టుబడుండటం ఆయనకే చెల్లింది. కథ, నవల, నాటకం, విమర్శ, కావ్యం, వ్యాసం, జీవితచరిత్ర ఏది వ్రాసినా అందులో తనదైన 'ముద్ర' కనిపిస్తుంది. తన భావాల్ని నిస్సంకోచంగా ప్రకటించడం కనిపిస్తుంది. నశించిపోతున్న ధర్మాన్నీ, దాని స్వరూపాన్నీ వేయిపడగల్లో ఎంత చక్కగా ఎత్తి చూపించారో, సమాజం తన ధర్మాన్ని కాపాడుకోవలసిన ఆవశ్యకతను చెలియలికట్టలో అంత చక్కగా నొక్కి చెప్పారు.

'చెలియలి కట్ట' అన్న పేరే చెబుతుంది సమాజపు సరిహద్దును. ఆహద్దు దాటితే తన స్వరూపానికే ముప్పు ఏర్పడుతుందన్న హెచ్చరికను నిర్మొహమాటంగా తెలియజెయ్యడం నిస్సందేహంగా సాహసమే. అంతటి సాహసం సాంప్రదాయవాదిగా పేరుపడ్డ ఒక కవి చేయడం విశేషంగానే కాదు, విడ్డూరంగా కూడా కనిపిస్తుంది. ఆయన సంప్రదాయంలో ప్రయోగ వైలక్షణ్యం దాగి ఉందనడానికి ఇదొక చిన్న ఉదాహరణ మాత్రమే. ఇలాంటి మరికొన్ని ఉదాహరణల ద్వారా చెలియలి కట్టలోని విశ్వనాథ ప్రయోగ వైలక్షణ్యాన్ని స్థూలంగా పరిశీలించడమే ఈ వ్యాసోద్దేశం.

**కథాపరంగా :-**

సంప్రదాయపు ఔన్నత్యాన్ని చాటడాని కనువైన ఇతివృత్తాన్నెన్నుకున్నా కూడా కథలో పలుమార్లు ప్రయోగాన్ని ఆవిష్కరించడం కనిపిస్తుంది. కథా ప్రారంభానికి కథలో మూలానికి సంప్రదాయకుటుంబాన్నే ఎన్నుకున్నా అందులో రంగారావు రూపంలో ప్రయోగాన్ని మేళవించారు. ఆ ప్రయోగం అరకొరగా చేసిందికాదు. సంద్రాయానికి లోబడి ఉండేలా చేసిందీకాదు. సంప్రదాయంలోని బలహీనతల్ని ఎత్తి చూపించేలా చేసింది. పరస్పర విరుద్ధభావాల్ని చిత్రిస్తూ వాటిమధ్య నెలకొన్న సంఘర్షణను పాఠకుల కళ్ళకు కట్టినట్లుగా వర్ణించడాన్ని గమనించ వచ్చు. స్త్రీల పట్ల, వారి దుర్భర జీవితంపట్ల రచయితకు సంప్రదాయంతో పనిలేకుండా "సానుభూతి' ఉందనడానికి నిదర్శనంగా రంగని ద్వారా చెప్పించిన ఈ మాటల్ని ఉదహరించవచ్చు. "పూర్వాచార పరాయణులందరూ ఆడవాళ్లని ఇట్లా .... అన్యాయం చేస్తున్నారు. మీరందరూ గొర్రెపిల్లల్లాగా · వున్నారు. పెద్దవాళ్లంతా కసాయివాళ్లే.

ఎస్.ఎస్. రాజు ఎం.ఏ.ఎం.ఫిల్ "సరస్వతి మహల్"
కోహెడ : 505473 కరీంనగర్ : జిలా

మీగొంతుకలు కోస్తున్నారు. నోరువాయిలేని మిమ్మల్ని వాళ్లు ఏమి చేసినా చేసిన వాళ్లే. మీకు ఈడూ జోడూ ఐన సంబంధాలు తేవడం వాళ్లకిష్టంలేదు. ముసలి వాళ్లకు మాటా మంచీ తెలియదు వాళ్ల పనులు వాళ్లు చూచుకొంటూ వుంటారు'' సంప్రదాయంలోని బలహీనతను వెక్కిరించడానికి రచయిత వెనుకాడలేదు ''ఆడవాళ్లు, మగవాళ్లూ అందరూ సమానమే. ఆడవాళ్లే ఎపుడూ వంట ఎందుకు చేయాలి? మగవాళ్లెందుకు చేయకూడదు? మగవాళ్లను చూస్తే ఆడవాళ్లు ఎందుకు తొలగిపోవాలి? ఎందుకు సిగ్గుపడాలి? నలుగురిలో ఆడవాళ్లు మాట్లాడకూడదా? ఆడవాళ్లూ మగవాళ్లూ కలిసి ఉండకూడదా?ఆడవాళ్లు బజారులోకి ఎందుకు పోకూడదు? మగవాళ్లతో కలిసి ఎందుకు ఉండకూడదు? భార్యాభర్తలిద్దరూ సమానమే'' రంగారావును ఆసరా చేసుకొని సంప్రదాయంలోని బలహీనతల్ని వెక్కిరించిన రచయిత సీతారామయ్యతో కలిసి ఉమ్మడి కుటుంబానికీ ఆకుటుంబ బాధ్యతలకూ అతన్ని కర్తను చేయడంద్వారా సంప్రదాయం యొక్క ఔన్నత్యాన్ని చాటాడు.

''నాయనా! ఇంకా నాల్గురోజుల తర్వాత వెళ్లదువుగాని, డబ్బు దొరుకుటలేదు. ఏదో నా కష్టములు నేను పడెదనులే అనెను''. రంగారావు తనకక్కడ చదువులు చెడిపోవుననెను. సీతారామయ్య ''నాల్గు రోజులకేమి చేయుదము .... పైన భగవంతుడున్నాడు. నీవు సంపాదించి దీర్చెదవని యీ గుండము త్రవ్వు చున్నాను'' అనిచెప్పి ఇంటిలోనికి బోయెను '' రచయితకు సంప్రదాయంపైగల మక్కువను చాటడంలో ఉపయోగ్య పడిన మరొక పాత్ర సరస్వతి. ఈమె ద్వారా కూడా సంప్రదాయాన్ని సమర్థించాడు రచయిత.

సరస్వతిః- ఒరే రంగా ! మనమేమన్నా జమీందార్లమా?! నలుగురూ నాల్గుపనులు చేసికోకపోతే సంసారం ఎట్లా సాగుతుంది ... అవును నాగరకులే. మీనాగరికమంతా వెలిగిపోతుంది. సాగుతుంటే నాగరికమే. అన్నయ్య సాగిస్తున్నాడు. ఉన్నరెండెకరాలూ కూడా నీ మూలంగా తాకట్టు పెట్టవలసి వచ్చింది. నీవేమో ఉద్ధరిస్తావనుకుంటే వదినెగారిని వెనకవేసుకు వస్తున్నావు. చాలు ! నోరుముయ్యి'' ఈ మాటల్ని రచయిత ప్రయోగంలోని అనౌచిత్యాన్ని ఉద్దేశించి అన్నాడేమోననిపిస్తుంది. సంప్రదాయం ప్రయోగం ఎదురు పడిన చోట సంప్రదాయానిదే పైచేయి అవుతుంది. సీతారామయ్య యేడాది క్రిందట నున్న తన భార్యస్థితికి ఇప్పటి తన భార్యస్థితికి భేదము మనసులో కొంత తెలుసుకొనెను. అతడు తన మనోభావములను కొన్నిటిని సరస్వతితో చెప్పెను. తల్లి కూడా వినెను. ముప్వురును కలిసి రత్నావళిని రాపిడిపెట్టిరి. ఆమె కొంతసేపటికి తన మనసును బయటపెట్టెను.

రత్నాః- పురుషులు పెత్తనం చెయ్యటమేమి? ఆడవాళ్లింట్లో బానిసలవలె చాకిరీ చెయ్యటమేమి? ....

సరః- నేనూ ఆడదాన్నేగా ? నేను చెయ్యడంలేదా ?

రత్నా ః- నేనూ చెయ్యక నువ్వూ చేయ్యకపోతే ఎల్లా సాగుతుంది?!

సర ః- ఇవేం బుద్ధులేవ్ ... పతివ్రతవనుకున్నాను ..

రత్నా ః- ఎవరూ పతివ్రతలుకారు ... ఈ పతివ్రత అన్నమాటమ ఆడవాళ్ల గొంతుక కోసేందుకు మగవాళ్లు కల్పించారు.

ఇలా ఒక పద్ధతంటూ లేకుండా సాగుతుంది. రత్నావళి వాదన. దానికి కారణం ప్రయోగానికి స్పష్టమైన గమ్యం లేకపోవడమే. సీతారామయ్య సంప్రదాయానికీ రంగారావు ప్రయోగానికీ రత్నావళి సంఘానికీ ప్రతీకలు రత్నావళి (సంఘం) సీతారామయ్య (సంప్రదాయం) చెంతనే ఉన్న రంగారావు (ప్రయోగం) ఆమెను అక్కణ్ణుండి బయటకు తీసుకురాబూనుకుంటాడు. అందుకు ఆమె సహకారం లభించడం గమనించదగ్గది. సంప్రదాయ ప్రయోగాల మధ్యన సంఘంపడే ఘర్షణంతా రత్నావళి పడింది. సంప్రదాయం మూర్తీభవించిన సీతారామయ్యను వదులుకోలేక, ప్రయోగాన్ని ఆవిష్కరించబూనుకున్న రంగారావును కాదనలేక ఆమె సతమతమయ్యింది. సరియైన అవగాహన లేకపోవడం, ముందుచూపు కొరవడడం వల్ల రత్నావళి తుదకు సంప్రదాయపు

చెలియలికట్టను త్రెంచుకొని బయటపడి (ప్రయోగం పేరుతో) తన ఉనికిని ప్రశ్నార్థకంచేసుకొని నవ్వుల పాలయ్యింది. ఆమెపై పాఠకులకు కలిగే సానుభూతి అంతా రచయిత ప్రయోగవాదులపై చూపించిన సానుభూతియే తప్ప వేరుకాదు. ప్రయోగం (రంగారావు)లో పసలేకపోతే సమాజం (రత్నావళి) అటు సంప్రదాయానికీ (సీతారామయ్య) దక్కకుండా ఇటు ప్రయోగానికీ (రంగారావు) చిక్కకుండా అస్తవ్యస్తమై పోతుందన్న చేదునిజాన్ని విశ్వనాథ "చెలియలికట్ట" ద్వారా నిర్ద్వంద్వంగా చాటాడు విశ్వనాథ ద్వేషించిన ప్రయోగాన్ని కాదని, అందులోని చెడును చెప్పడానికి చక్కని ఉదాహరణగా నిలుస్తుంది చెలియలికట్ట.

## 11. పాత్రలపరంగా :-

1. సీతారామయ్య:- కథకు నాయకుడుకాక పోయినా కథానాయకుని లక్షణాలన్నీ ఉన్న సీతారామయ్య మొదటి అధ్యాయములో పరోక్షపాత్రగానే ఉన్నాడు. పలుమార్లు రచయిత అతని గుణగణాల్నీ, వ్యవహారదక్షతనూ, నీతి నిజాయితీల్నీ, ధర్మగుణ పరత్వాన్నీ, ఠీవినీ, ముక్కుసూటిగా వ్యవహరించే తీరునూ గురించి వివరించారు. అంతే కాకుండా ఒకసంప్రదాయ వాదిగా, సదాచార సంపన్నుడిగా అయన్ను పరిచయం చేశారు. తండ్రి పేరును నిలుపడానికి సదా తాపత్రయపడే సీతారామయ్య దురదృష్టవశాత్తూ భార్యపోయినా మళ్లీ పెళ్లిచేసుకున్నాడు. తమ్ముణ్ణి చదివిస్తూ, వితంతువైన సోదరి సరస్వతిని ఇంట్లో ఉంచుకొని పోషిస్తూ ఆమె కుమారుల్ని చదివిస్తూ ఉమ్మడి కుటుంబభారాన్ని మోస్తున్న సదాశయసంపన్నుడు.

సంప్రదాయవాది యైనప్పటికినీ దాన్నేపట్టుకొని వ్రేలాడినట్లుగా కనిపించడు. తన భార్య తమ్ముడితో కలిసి వెళ్లిపోవడాన్ని కూడా తట్టుకొని నిలబడగలిగాడు. అంతేకాదు మళ్లీ సలక్షణంగా పెళ్లిచేసుకొని సుఖంగా పరిపూర్ణజీవితాన్ని గడిపాడు. సంప్రదాయానికి పరీక్ష లెదురైనా, ఒడుదొడుకులెదురైనా తట్టుకొని నిబ్బరంగా నిలిచి అది ఉంటుందన్న విషయాన్ని విశ్వనాథ సీతారామయ్య గారి పాత్రద్వారా ప్రకటించాడు.

రంగారావు:- ప్రయోగానికి ప్రతీకగా నిలిచిన పాత్ర. కథకు సంబంధించిన నాయకునికి ఉండవలసినంత ప్రాధాన్యతను సంతరించుకున్నప్పటికినీ గుణగుణాలు మాత్రం ప్రతినాయకునివి. రంగారావును ప్రయోగానికి ప్రతీకగా చేసి అతని ఆలోచనా వైరుద్యాల్ని, అవగహనా రాహిత్యాన్ని ప్రశ్నించడం ద్వారా రచయిత ప్రయోగంలోని అనౌచిత్యాన్ని ప్రశ్నింపబూనుకున్నాడు. ప్రయోగవాదుల్ని వెక్కిరించ్చడానికి రచయితకు పనికివచ్చిన పాత్రగా రంగారావును పేర్కొన వచ్చు. రంగనిపనులవెనుక ఆధునికతను బలహీంగా మార్చి, లేని అవివేకాన్ని అంటగట్టి మాత్రం రచయిత విజయం సాధించబూనుకోలేదు. రంగణ్ణి అధునిక భావాలు కల యవకునిగా కూర్చడంలో రచయిత తగినంత శ్రద్ధ వహించాడనే చెప్పాలి. 'రంగడు వేషమున పరమాధునికుడు. మీసములు, ముక్కుక్రింద నటునిటు నాల్గు పోచలు. క్రాపింగుమాయరాదు. గడ్డమునకు ప్రతిదినము బరిచర్యం, కన్నులకు గైవారములు లేని యద్దముల జోడునూ కంటి మెడ ప్రక్క గుండీల చొక్కా. బంగాళీకట్టు చేతిలో నెల్లప్పుడు పత్రికయో పుస్తకమో యుండవల యును" అంటూ అతని రూపాన్ని దిద్దెను. "అతని మనస్సు పురుషులు స్త్రీలను అధః పతితలుగ జేయుచున్నారని విచారించును. "లోకములో సంపదయు, దారిద్ర్యము నెట్లు బహువిషయముల నెగుడుదిగుడులు తెచ్చుచున్నవో విచారింపడు. స్త్రీపురుషుల యౌవనదశామద ప్రాదుర్భావమే పరామర్శించును గాని వార్ధక్యదశ(రోగ దశ, అకాలమృత్యు దశ వైపరీత్యమును గూర్చి యోచింపదు అతడు దైవము లేడని ధృఢనిశ్చయము చేసి కొనెను. గానీ మృత్యువు మృత్యువని బహుమతకర్తలు చేసిన ఘోష యతనికి బట్టదు" అంటూ అతని మనస్సును విపులంగా పాఠకులకు చూపించాడు. తపపరంగా రంగని వ్యాఖ్యానిస్తూ "బయటికెంత యాధునికుడో లోన దానికి రెట్టింపు. అతనికి కొందరు పూర్వాంధ్రకవుల నామములు దెలియును. వారి పుస్తకములెన్నడును జదువలేదు" ఇవి అతని అంతరబహిర వేషభాషలు. ఈ వేషభాషల్ని బట్టి

రచయిత రంగాన్ని ఆమూలాగ్రంగా ఎలా చూపించాడో తెలుసుకోవచ్చు. కాగా ఇలాంటి ఆలోచనలతో రంగారావు ముందుకుసాగడాన్ని సమర్థవంతంగా చిత్రిస్తూనే ప్రతిచోటా అతన్ని నిశితంగా పరిశీలిస్తూ అతడు దారితప్పడాన్ని వేలెత్తి చూపించాడు. అందుకే సంప్రదాయ వైలక్షణ్యాన్ని చాటడంలో విశ్వనాథకు మిక్కిలి ఉపయోగపడిన పాత్రగా రంగారావు పాత్ర నిలిచింది.

రత్నావళి :- కథానాయిక అయిన ఈమె సమాజ స్థితి ఆవిష్కరించడానికి రచయితకెక్కువగా ఉపకరించిన పాత్రగా నిలిచి పోయింది. సమాజంలో సంప్రదాయ ప్రయోగాల మధ్యన సంఘర్షణ జరుగుతున్నప్పుడు కనిపించే వ్యాకులత పునరాలోచనల వంటివి రత్నావళిలో కూడా కన్పిస్తాయి. మొదట్లో రంగారావుతో మాట్లాడ్డానికే భయపడ్డా తర్వాత అతని ఆలోచనల్ని అనుసరించింది. అటు తర్వాత కొన్నిసార్లు అతన్ని దాటి ముందుకెళ్లినట్టుగా కన్పిస్తుంది. అలావెళ్లడంచేతనే ఆమె ప్రయోగవాదంలోని రంగని తరహా ఆలోచనలను అందరిలోపాల్ని కనుక్కో గలిగింది. అంతేకాదు. సంప్రదాయం యొక్క ఔన్నత్యాన్ని కూడా అక్కడే తెలుసుకుంది. ఆమెపట్ల పాఠకులకు సానుభూతి కలగడానికి ఇదెంతో దోహదం చేసింది. అయితే అప్పటికే ఆమె తిరిగి వెనక్కిరాలేనంత ముందుకు వెళ్లడంచేత దురదృష్టవంతురాలిగా చెలియలికట్టను దాటి తన ఉనికికే ముప్పు తెచ్చుకున్న నీటిలా తిరిగి తను కోరుకునే పాత స్థానానికి చేరుకోలేక విలవిలలాడింది. హద్దుల్నిదాటినాకూడా పాఠకుల సానుభూతిని అమితంగా పొందగలిగేలా రత్నావళిని చిత్రించడం ద్వారా రచయిత ఆమెకు తన చేయూతనందించాడు. సమాజానికి ప్రతీకగా నిలిచిన రత్నావళిని తనను తాను తెలుసుకునేదానిలాగా చిత్రించడం రచయిత ప్రతిభకు తార్కాణం.

సరస్వతి :- సంప్రదాయ ఔన్నత్యాన్ని చాటడంలో రచయితకు సహకరించిన పాత్ర. ఈమె వాదన ముందు రంగారావు, రత్నావళులు పలుసార్లు ఓడిపోవడం కనిపిస్తుంది. సంప్రదాయానికి గల శక్తిని చాటడానికి ఆవిధంగా సరస్వతి రచయితకు ఉపకరించింది. ఉమ్మడి కుటుంబంలో ఈమె నిర్వహించిన పాత్ర బాధ్యతాయుతమైనదిగా నిలిచి పాఠకుల ప్రశంసల్ని అందుకునేలా తీర్చిదిద్దాడు. రచయిత.

ఇతర పాత్రలు :- ఇందులో పేర్కొనదగినవి నీలమోహనుడు, హరికిషోరరావు, శాస్త్రి, ముకుందరావు, నీలాంబరుడు మొదలైనవి. ఇవన్నీకథాబలానికే కాదు సంప్రదాయ ప్రయోగాల స్వరూప స్వభావాలకు సమాజంలోని భిన్నమైన ఆలోచనలకు, వింతపోకడలకు, సంప్రదాయ ప్రయోగాల పట్ల గల స్పందన ప్రతిస్పందన లకు ప్రతీకలుగా నిలిచాయి. అటు రచయితకు కథపరంగా ఆవిష్కరించబూనుకున్న ప్రయత్నానికి చేదోడుగా నిలవడమే కాకుండా ఇటు నవలాశిల్పానికి సమాజ వైరుధ్యాలకు ఆలంబనలుగా నిలిచి రచయిత ప్రయత్నాన్ని సఫలం చేయడంతో పాటుగా నవలను ఫలవంతం, శక్తివంతం చేశాయి.

3. దేశ, కాలపరంగా :- స్వాతంత్ర్యం రావడానికి పూర్వం ప్రజల్లో చైతన్యం, సమైక్యత, ఆధునికభావాల పట్ల స్థితిగతుల పట్లఅవగాహన, మోజు పెరుగుతున్న కాలంలో చెలియలికట్ట (19) వ్రాయబడింది. సమకాలీనభావాల్ని, సమాజ స్వరూపభావాల్ని ఉన్నదున్నట్లుగా నవలలో కెక్కించే ప్రయత్నం రచయిత చేశాడు. 1920 కడలికెరటంలా పొంగిపొరలి ప్రజల్ని సంఘటితపరచింది. ఆ భావోధృతి కారణంగా ఆలోచనలు క్రొత్తపుంతలుత్రొక్కాయి. సంప్రదాయాల్ని వెనక్కి నెట్టివేయాలన్న తపన కొందరిది కాగా దాన్ని పట్టించుకోకూడదన్న భావం మరికొందరిది. దాన్ని పునరిద్ధరించాలన్న భావం ఇంకొందరిది. అయితే ఈ మూడు రకాల భావాల వాళ్ళు కలిసి ముందుకు సాగుతున్నారేకానీ, ఎవరూ తమ లోపలి భావాల్ని బయటపెట్టలేకపోతున్నారు. కారణం కడలి కెరటంటాంటి ఆవేశమే. స్వాతంత్రోద్యమంలో 1920 నుండి 1930 వరకు గల దశాబ్దానికి ఎంతో ప్రాముఖ్యత ఉంది. సాహిత్యపరంగా కూడా ఈదశాబ్దం ప్రాముఖ్యతను సంతరించుకున్నట్టిదే.

ముఖ్యంగా ఈ కాలారంభంలో వచ్చిన మాలపల్లి (1919లోనే) ఒక ఉత్తేజాన్ని ఉత్సాహాన్ని సమాజంలో ఒక విధమైన చైతన్యాన్ని కలిగించగలిగింది. పాతభావాలు మూలపడి సరికొత్త భావాలు సమాజంలోకి రావడానికి ఉవ్విళ్లూరుతున్న కాలంలో కవులు, రచయితలు, గురుతరమైన బాధ్యతను నిర్వర్తించవలసి ఉంటుందన్నది సర్వవిదితమే. కాగా ఈదశాబ్దకాలంలో కవులూ, రచయితలూ అలాంటి బాధ్యతను భుజానికెత్తుకోవలసిన అవసరం వచ్చింది. అనేకమంది అందుకు సంతోషంగా ముందుకు రావడం గమనించదగ్గది. సంప్రదాయంలోని ఔన్నత్యాన్ని చాటడానికి విశ్వనాథ పూనుకుంటే ప్రయోగం పేరిట చలం తన ప్రయత్నాల్ని నిర్వహించబూను కున్నాడు. కృష్ణశాస్త్రి మొదలైన భావకవులు స్వేచ్ఛాప్రణయాన్ని సమర్థించగా బాపిరాజు లాంటివాళ్లు మధ్యేమార్గాన్ని అనుసరించారు. అప్పుడు వెలువడింది కావడంచేత చెలియలికట్ట సంఘంలోని వైరుధ్యాల్ని అంత చక్కగా ప్రతిబింబించింది. రచయిత సంప్రదాయశక్తి కనిపిస్తున్నా ప్రయోగం పట్ల ద్వేషం లేకపోవడాన్ని కూడా సూచిస్తుంది. ఒక విధంగా ప్రయోగావాదానికి చెలియలికట్ట తగిన సూచనల్ని చేసిందని చెప్పవచ్చు. ప్రయోగం జరగడం క్రొత్తనీరు రావడం ఆహ్వానించదగిన పరిణామమే అయినా దాని మూలంగా సంప్రదాయం దెబ్బతినడం విలువలు నశించడం సమాజగమనం అయోమయం అస్తవ్యస్తం కావడం లాంటి వాటిని నివారించవలసిన బాధ్యత కవులూ, రచయితలదేననేది నిర్వివాదాంశం ఆసంఘర్షణను సమర్థవంతంగా చిత్రిస్తూ ప్రయోగం ఔచిత్యరహితంగా సాగితే తలెత్తే పరిస్థితులకు పట్టిన దర్పణంగా చెలియలి కట్టను కూర్చారు విశ్వనాథ.

**4. రచయిత పరంగా :-** చెలియలికట్ట ప్రయోగవైలక్షణ్యాన్ని పరిశీలించే ప్రయత్నంలో తప్పకుండా గమనించవలసిన అంశం "రచయిత-ఆయనదృష్టి". విశ్వనాథ మార్గాన్నీ ఆ మార్గం ద్వారా ఆయన సాగించిన తీరు తెన్నుల్ని సాధించిన విజయాల్ని పరిశీలిస్తే సంప్రదాయ వాదిగా పేరుపడ్డా ఆయనగొప్ప ప్రయోగశీలిగా కనిపిస్తారు. ప్రయోజనంలేని ప్రయోగం పాతబడిన సంప్రదాయం కన్నా ఎలా గొప్పదౌతున్నది అనేది విశ్వనాథ ప్రశ్న. నిజమే పాతవిధానం అక్కరకురాదనుకున్నప్పుడు, అది లోపభూయిష్టమైన దనుకున్నప్పుడు క్రొత్త విధానాన్ని ఆవిష్కరించాలనీ ఐతే ఆక్రొత్త విధానం వచ్చీ రాకముందే లోపభూయిష్టంగా ఉంటే ఇక అది రావడంవల్ల ప్రయోజనమేమిటి? విశ్వనాథ తత్త్వంలోని ఈ రహస్యాన్ని వారి ప్రతిరచన బయటపెడుతూనే ఉంది ప్రయోగంలోని అనౌచిత్యాన్ని సరస్వతి పాత్ర వెక్కిరిస్తూ "స్త్రీ లంట్లుతోమరాదు. పురుషులు తోమవలెనందువా? కొన్నాళ్లు పురుషులు తొమినచో, నాడు వాండ్రే యధికారములు చేసినచో నిపుడు స్త్రీలెదురు తిరిగినట్లే యప్పుడు పురుషులు నెదురు తిరుగుదురు సృష్టిలో ఈ తగాదా యెట్లు తీసివేసెదవు? భూత భవిష్యద్వర్తమాన పురుషులందఱుగూడి యొక సభచేసి స్త్రీలను బాధించుటకు బన్నుగడలు పన్నలేదు. సంప్రదాయముగ నొక యాచారము వచ్చుచున్నది పరంపరంగా నది యాచరింపబడుచున్నది. ఆయాచారము బాగుగాలేదనుము. ఆచరించువారు తెలివితక్కువ వారనుము. అప్పుడాచారము మంచిదో, చెడ్డదో విచారింతము. ఇదియంతయు గట్టకట్టి యొక జాతినెత్తిన, ఒక వర్ణమునెత్తిన బెట్టుట తప్పు" అని స్పష్టంగా తెలియజేశారు. తన పాత్రల ద్వారా తన అభిప్రాయాల్ని సూటిగా చేప్పే విశిష్ట పద్ధతి విశ్వనాథ స్వంతం.

చెలియలికట్ట ఒక ప్రయోగవాద నవల. సంప్రదాయం పట్ల మక్కువను ప్రకటిస్తూ ప్రయోగంలోని ఔచిత్య రాహిత్యాన్ని వేలెత్తి చూపిందది. తెలుగునవలా చరిత్రలో చెలియలికట్ట ప్రత్యేకమైనట్టిదేకాదు. విలక్షణమైనట్టిది కూడా. అందుకే 'విశ్వనాథ ప్రయోగ వైలక్షణ్యానికి ఎత్తిన పతాక' యే "చెలియలికట్ట" నవల అంటే అతిశయోక్తికాదు.

# 'కవిసార్వభౌముని కాళిదాసానుకరణ'

- కుమారి

"ఆంధ్ర సాహిత్య ప్రపంచమున అఖండ యశమును ఆర్జించిన కవిసార్వభౌముడు, బహుముఖ ప్రజ్ఞాశాలి, బహుగ్రంథ రచనాధురీణుడు, బహుదేశ సంచారములు చేసి దిగ్దిగంతముల తన కీర్తి చంద్రికల వ్యాపింపచేసిన మహాకవి. కవితాపథమున నూతన మార్గము లవలంబించి కవులకు ఆదర్శప్రాయమైన ప్రతిభాపంతుడు శ్రీనాథుడు".

భీమాంబా మారయామాత్యుల ముద్దుల బిడ్డడు, కవితాపితామహుడు, సరససాహిత్య సామ్రాజ్య చక్రవర్తి అగు కమలనాభామాత్యుని మనుమడు మరియు శిష్యుడు శ్రీనాథుడు. పదునైదవ శతాబ్దమునకే కవితా మహారాజ్య భద్రాసనా సీను డీతడు.

శ్రీనాథుడు తన నిండు జవ్వనమున రచించిన శృంగార నైషధ కావ్యములో తనను గూర్చి తాను ఇలా చెప్పికొనినాడు.

శా: భారద్వాజ పవిత్రగోత్రుని శుభాపస్తంబ సత్సూత్రు వి
ద్యారాజీవుని మారయకు బుణ్యాచార భీమాంబకున్
గారంబైన తనూజు నన్ననఘు శ్రీనాథాఖ్యునిం బిల్చి స
త్కారం బొప్పగ గారవించి పలికెన్ గంభీర వాక్ప్రౌఢిమన్
(శృ.నై. 1-12)

శా: బ్రాహ్మీదత్త వరప్రసాదుడ వురు ప్రజ్ఞా విశేషోదయా
జిహ్మస్వాంతుడ, వీశ్వరార్చన కళాశీలుండ, వభ్యర్హిత
బ్రహ్మాండాది మహాపురాణ చయ తాత్పర్యార్థ నిర్ధారిత
బ్రహ్మజ్ఞాన కళా విధానమవు నీ భాగ్యంబు సామాన్యమే
(శృ.నై. 1-13)

ఈ విధముగా ఆతని పద్యముల ద్వారా భారద్వాజ గోత్రుడనియు, ఆపస్తంబ సూత్రుడనియు, విద్యారాజీవుడనియు, అంతేగాకుండా బ్రాహ్మీదత్త వర ప్రసాదుడనియు, ఈశ్వరార్చన కళాశీలుడనియు, అఖిల పురాణ విద్యా ప్రవీణుడనియు, సకల శాస్త్ర పారంగతుడనియు, తెలియుచున్నది.

సీ. చిన్నారి పొన్నారి చిఱుత కూకటినాడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూగు మీసాల నూత్న యౌవ్వనమున
శాలివాహన సప్తశతి నుడివితి
సంతరించితి నిండు జవ్వనమున యందు
హర్షనైషధ కావ్య మాంధ్ర భాష .
ప్రౌఢ నిర్భర వయః పరిపాకమున
గొనియాడితి భీమనాయకుని మహిమ
ప్రాయమింతకు మిగుల కై వ్రాలకుండ
గాశికాఖండమను మహాగ్రంథమేను
దెనుగు జేసెద గర్నాట దేశ కటక
పద్మవన హేళి శ్రీనాథ భట్టసుకవి (కా.ఖం.1-7)

పై పద్యం ద్వారా శ్రీనాథుడు చిన్నారి పొన్నారి చిఱుత ప్రాయం నుండే రచనలు చేసినాడని తెలియుచున్నది. పై సీస పద్యంలోనివే కాక ఇంకా ఎన్నో రచనలు కావించినాడు.

ఇక శ్రీనాథుడనగానే "శృంగార రసము" "తళుక్కు"మని స్ఫురించును. తెలుగులో విడివిడిగా బహుకావ్య రచనలు సాగించినవాడు శ్రీనాథుడే. ఇతని కావ్యములలో శృంగారనైషధం, హరవిలాసము, క్రీడాభిరామము మున్నగునవి ముఖ్యముగా శృంగార రచనలే. భీమఖండము, కాశీఖండము భక్తి ప్రదాన కావ్యము లైనను రక్తిప్పర్శ లేకపోలేదు. ఇతని చాటువులు శృంగార రసమునకు బంగారు పేటికలు. ఇంతకుముందే

ఉస్మానియా విశ్వవిద్యాలయం, ఉమెన్స్ కాలజీ, కోఠీ

కుమారసంభవములో, దశకుమారచరిత్రలో, కేయూర బాహు చరిత్రలో శృంగార రసమునకు సముచిత స్థాయి లభించినను శ్రీనాధుని రచనలలో పరాకాష్ఠ నందుకొనినది.

ఇంతేకాక శ్రీనాధుని తోనే కథా ప్రాధాన్యం తగ్గి రసప్రధానమైన రచనలు వెలువడినవి. శృంగార నైషధం, హరవిలాసం, ఇట్టి రచనలే. తెలుగు నుడికారమునకు, సీసపద్యముల చిత్రచిత్ర-గతులకు ఒకే ఒక విషయమును పెక్కు భంగుల సాగదీసి చెప్పెడు ధోరణులకు శ్రీనాధుడే శ్రీకారం చుట్టినాడన వచ్చును.

"శ్రీనాధుడిని అన్ని రచనల కంటే చాలా సులభశైలిలో ద్రాక్షాపాకంలో రచింపబడిన మనోహర కావ్యరాజం హరవిలాసం" ఈ కావ్యము క్రీ.శ. 1400 ప్రాంతమున రచింపబడెనని విమర్శకుల అభిప్రాయం. హరవిలాసము ఏడు ఆశ్వాసముల ప్రబంధము. ఈ హరవిలాసంలో ప్రథమ, ద్వితీయ ఆశ్వాసములలో చిఱుతొండనంబి చరిత్రమును తృతీయ చతుర్ద ఆశ్వాసములలో గౌరీ కళ్యాణమును, పంచమాశ్వాసములో దారుకావన విహారమును, షష్ఠాశ్వాసములో హాలాహల భక్షణమును, సప్తమాశ్వాసములో కిరాతార్జునీయమును. వర్ణించినాడు.

ఈ కావ్యములో పరమేశ్వరుని వ్యవహారము గనుక 'విలాస'మన్న శబ్దము అతికినట్లుగా ఉన్నది. పరమేశ్వరుడైన శివుని విషయంలో ఏదియైననూ విలాసమే! "హర విలాసము" అను పేరు సార్ధకము. ఈ కావ్యమునకు కృతికర్త "అవచి తిప్పయసెట్టి". ఇతడు శ్రీనాధుని బాల్యసఖుడు. ఈ అవచి తిప్పయసెట్టి కొండవీటి పాలకుడగు కుమారగిరిరెడ్డికి ప్రతి సంవత్సరము ఉత్సవమునకు సరిపడు సుగంధ ద్రవ్యములు, కస్తూరి ఇస్తూ, అనేక బహుమానాలు, సన్మానాలు, బడసెను.

శ్రీనాధుడు రచించిన హర విలాసములోని ఆశ్వాసములలో కూర్చబడిన హరుని విలాస వర్ణనల్లో ఏవిలాసమునకు ఆవిలాసము ఒక ఖండకావ్యముగా అగుపడును. అయిననూ ఏకనాయకత్వము, ఏకసూత్రత కల్గి ఉండుట వలన దీనిలోని మహాకావ్యత్వమునకు భంగం కల్గలేదు. ఈ కావ్యము శ్రీనాధుని స్వతంత్ర రచనగా చెప్పవచ్చును. ఇది ఏ సంస్కృత గ్రంధమునకును భాషాంతరీకరణము కాకున్నను, ఇందలి "గౌరీ కళ్యాణ" ఘట్టం మాత్రం కాళిదాసు యొక్క కుమారసంభవమునకు స్వతంత్రమైన అనువాదముగా అగుపడును.

1) శ్రీనాధుడు కొన్ని శ్లోకములను, శబ్దములను ఉన్నదున్నట్లుగా అనువాదం చేసినాడు.
2) కొన్ని శ్లోకాలలోని భావం గ్రహించి పద్యరచన కావించినాడు.
3) కొన్నింటిని మూలభావంతో తన భావాన్ని పొందుపరచి అనువదించినాడు.
4) కొన్నిచోట్ల పూర్తిగా స్వతంత్ర భావములతో రచన సాగించినాడు.

ఈవిషయము దృష్టియందిడుకొని పరిశీలింతముః-

శ్రీనాధుడు కొన్ని శ్లోకములను, శబ్దములను ఉన్నదున్నట్లుగా అనువాదించిన విధానము ః-

పార్వతీదేవి జనన సమయమున గల శ్లోకములలో శబ్దములను అలాగే గ్రహించాడు.

శ్లోః "ప్రసన్నధిక్ పాంసు వివిక్తవాతం శంఖస్వనానంతర

శరీరిణాం. స్థావర జంగమానాం. సుఖాయ తజ్జన్మదినం బబూవ (కుమా.1-23)

శ్రీనాధుడు ఈ రీతిగ శబ్దములను ఉపయోగించుకొనినాడు.

కం. స్థావర జంగమ భువన శు
భావహమై విశద దశ దిశాంతమై యా
దేవి యుదయంబు నొందిన
యావేళం కుసుమ వర్ష మంతట కురిసెన్ (హర. 3-21)

అట్లే "తయా దుహిత్రా . . . .

విదూర భూమిర్నవ మేఘశబ్దాత్
. . . . . . . . . . . . . . . . ." (కుమా.1-24)

ఇత్యాది శ్లోకంలోని శబ్దాలను తన పద్యం

"జనని విద్యుల్లతా.

......విదూర భూమికి నుద్దియయ్యె (హర. 3-22) అని గ్రహించెను.

పార్వతీ సౌందర్య వర్ణన చేయుపుడు చాలా శ్లోక పాదములను ఉన్నదున్నట్లుగా గ్రహించి శ్రీనాథుడు ఒకే వచనంలో వర్ణన కావించాడు.

శ్లోః దినే దినే సా పరివర్థమానా లబ్ధోదయా చాంద్రమసీవ లేఖా,

పుపోష లావణ్యమయాన్ విశేషాన్ జ్యోత్స్నాంతరీవ కలాంతరాణి" (కుమా. 1-25)

అను శ్లోకమును వచనంలో శ్రీనాథుడు వాక్యానికి వాక్యం ఎలా స్వీకరించాడో క్రింది వాక్యంలో చూద్దామా!

"అనంతరంబు ప్రతిదిన ప్రవర్ధమానమై లబ్ధోదయ యగు చంద్రరేఖయుం బోలె బంధు జనంబులకు ప్రమోదంబు సంధించుచు" (హర. 3-23) లో ఉన్నదున్నట్లుగా వ్రాసినాడు. మరియు "మందాకినీ సైకత వేదికాభిః సాకందుకైః కృత్రిమ పుత్రకైశ్చ" (కుమా. 1-29)

శ్లోకములోని దానికి శ్రీనాథుడు "మందాకినీ సైకత వేదికా స్థలంబుల గందుక క్రీడ సల్పుచు" అని గ్రహించినాడు. మరియు "అభ్యున్నతాంగుష్ఠ నఖప్రభాభిః విక్షేపణా ద్రాగమివోద్గిరంతౌ అజహ్రతు స్త చ్చరణౌ పృధివ్యాం.......... (కుమా. 1-33)

శ్లోకమును శ్రీనాథుడు "హరవిలాసం'లో "అభ్యున్నతాంగుష్ఠ నఖ ప్రభావిక్షేపంబున రాగంబు వెడలం గ్రక్కుననియుంబోని చరణ ప్రవాళంబులు" (హర. 3-23) అని అనువాదం చేసినాడు.

ఇంతేకాకుండా "ఉన్మీలితం తూలిక యేవ చిత్రం" (కుమా1-32)

శ్లోకమును "నేత్రోన్మీలనము చేసిన చిత్రంబును బోలె నవయౌవ్వన విభక్తంబై". (హర. 3-23) అని వచనంలో అనువాదం కావించినాడు. ఈ వచనంలోనే శ్రీనాథమహాకవి పార్వతీదేవి సౌందర్య వర్ణననంతయువ్రాసినాడు. ఇంకా "వృత్తాను పూర్వంబులై యనతి దీర్ఘంబులగు జంఘా ప్రకాండంబులును" (హర. 3-23) అను శ్లోకమునకు అనువాదమే.

శ్లో. మనీషితాః సన్తి గృహేషుదేవతాః, తపః క్వవత్స్యే క్వచ తావకం వపుః

పదం సహేత భ్రమరస్య పేలవమ్ శిరీష పుష్పం నపునః పతత్రిణః' (కుమా 5-4)

ఈ శ్లోకమును

"ఇక్కడ లేరె వేల్పులు సమీప్సిత దాతలు ముద్దులూన? నీ వెక్కడ ఘోరవీర తపమెక్కడ? యీపటు సాహసిక్యముల్ తక్కు శిరీష పుష్ప మవధాన పరత్వమునన్ మధువ్రతం బెక్కిన నోర్చునో? విహగ మెక్కిన నోర్చునో? నిశ్చయింపుమా! (హర. 4-6)

అను పద్యము అనువదించినాడు. పైశ్లోకంలోని సామెతను కూడా పద్యంలో చక్కగా అలాగే అనువదించినాడు.

శ్లో॥ అధాజినాషాఢ ధరః ప్రగల్భవాక్ జ్వలన్నివ బ్రహ్మ మయేన తేజసా

వివేశ కశ్చిజ్జటిల స్తపోవనం, శరీరబద్ధ ప్రధమాశ్రమో యధా" (కుమా.5-30)

అను శ్లోకమును శ్రీనాథుడు,

"ఆజినాషాఢ ధరుండు, ప్రౌఢతర భాషాతి ప్రగల్భుండు, నీ రజ బంధు ప్రతిమాన తేజుడు, జటారాజిచ్ఛటా తామ్రుమూ"

అని అనువదించినాడు.

2. కొన్ని శ్లోకాలలోని భావం యథాతథంగా గ్రహించి పద్యరచన కావించినాడు. అందులకుః-

"అధ్యావమానేన పితుః ప్రయుక్తా.............(కుమా.1.21) శ్లోకమును హరవిలాసంలో "వెఱవకు డింద్రాది విబుధ పుంగవులను" (హర 3-17) అను సీసపద్యములో మరియు "అటమున్న దక్ష కన్యక తండ్రితోనల్గి" (హర 3-20) సీసపద్యములో భావం గ్రహించి అనువాదం చేశాడు.

మరియు పార్వతీదేవి తండ్రి అనుమతిని గైకొని

నారవస్త్రములు ధరించి నప్పటి సందర్భములో మూల శ్లోకములోని భావం గ్రహించి
"భూధర రాజకన్యమణి........(హర 4-9)
"చంచరీ కాంగనా................(హర 4-10)
"ముత్యాల మొలనూలి మురువు" (హర 4-11)
"హంస తూలికా పాన్పుపై.....(హర.4-12)
"పాశుపత దివ్య దీక్షా.............(హర 4-13) ఇత్యాది చక్కగా రాజకుమార్తె అగు పార్వతీదేవి ఎంత కఠినమగు నిర్ణయానికి వచ్చినదో తెలియచేశాడు.

కాళిదాసు యొక్క "వికీర్ణ సప్తర్షి బలి"..........(కుమా. 5-37) శ్లోకములోని భావం గ్రహించి "అభ్రవీధి పరిచ్యుతం' ' (హర. 4-21) పద్యం వ్రాసినాడు. ఇది కపట వటువు పార్వతీదేవిని కుశల ప్రశ్నలు వేయు సందర్భములోనిది.

సత్పురుషుల చేత స్నేహం ప్రాప్తపదీనము అని బ్రహ్మచారి చెప్పచూ నీకు రహస్యము అనిపించకుంటే నేనడిగే ప్రశ్నలకు ప్రత్యుత్తరము చెప్పుము అను సందర్భములో కూడా శ్లోకములలోని భావం గ్రహించి శ్రీనాధుడు వచనంలో వ్రాసినాడు.

కుమార సంభవములో చెలికత్తె పార్వతి మనోరథమును బ్రహ్మచారి కెఱింగించు సందర్భములో 52 శ్లోకమునుండి 62 శ్లోకముల వరకు చెప్పబడగా శ్రీనాధుడు దాని నంతయు ఒకే ఒక వచనములో ఆ శ్లోకముల భావం గ్రహించి "అనినం బార్వతి యమ్మిథ్యావటునకుం.....(హర 4-26) వచనంలో చెప్పినాడు.

"పంకజ రేణుగంధి యగు పల్వలవారిగరేణు విచ్చె ని శ్శంక మదావళంబునకు జూచి గజంబును బద్మినీ మృణా లాంకురమర్ధ భుక్తము నిజాంగనకుం బ్రియమార నిచ్చె నా వంక దపోధనుల్ హృదయ వత్సలతన్ బ్రియ మంది చూడగన్"
(హర. 3-61)

ఈ పద్యములో శ్రీనాధుడు కాళిదాసు భావములకు మెఱుగులు దిద్దినాడు.

4. కొన్నిచోట్ల పూర్తిగా స్వతంత్ర భావాలతో రచన సాగించినాడు. పార్వతితో ఆ కపట బ్రహ్మచారి కుశల ప్రశ్నలు వేసిన తదుపరి పార్వతి మనస్సును తెల్పుకొనగోరి "ఏనును బ్రహ్మచారి దరళేక్షణ నీవును గన్యవింతకా" (హర. 4-25) పద్యములో "నీ తపస్సుకు పెళ్ళియే ఫలము అయినచో విచారమేల! బ్రహ్మచారినైన నన్ను వివాహమాడి నీ కోరిక తీర్చుకొమ్ము". లేదేని నాతపస్సులోని సగ భాగమును ఇచ్చెదను నీ తపస్సు వీడుము". అని పల్కుట శ్రీనాధుడి స్వతంత్ర కల్పన. వచ్చిన బ్రహ్మచారి వివాహమాడుమని పార్వతిని ఉద్దేశించి పల్కుట కొంత అసమంజసముగా అగుపడినను పార్వతి మనస్సు పరీక్షించగోరిన పరమేశ్వరుడి వాక్కుగా అది ఎంతయో సమంజసమై అగుపట్టును.

మరియు మూలమున 'విరూపాక్షము", "దిగంబరత్వ' ' మొదలగు అవలక్షణములు చెప్పగా శ్రీనాధుడు తన స్వంత భావాలతో వాటిని "మూడవ కన్ను జూచి చేపట్టెడు' ' పద్యము సృష్టించుట ఇచ్చట ఎంతో సముచితము. "దిగంబరత్వము" అని చెప్పుటకంటే "కట్టిన తోలు చీరయే ఆతని సంపద తెల్పుననుట మిక్కిలి సరసము" జీవుల ప్రాణములను హరించువాడు అను ఈ భావము రమణీయమైన స్వతంత్రకల్పనము. మరియు హరవిలాసములోని చిఱుతొండనంబి కథ కూడా స్వతంత్రము. ఇది చాలా క్రొత్త కథ. ఈ కథలో శ్రీనాధుని భాషయే వేఱు. ఆతని మాటలే వేఱు. ఈ ఘట్టములన్నియు శ్రీనాధుని కథన నైపుణ్యమును, సంభాషణాచాతుర్యమును చాటుచున్నవి.

ఇట్లీతని హరవిలాసము తెలుగు సాహితీ జగత్తున ఒక విశేష స్థానమును పొందుచున్నదని చెప్పవచ్చును.



# చాసో కవిత్వం! ఒక పరిశీలన

- డా॥ మానేపల్లి

కథకులు కవితలు రాయడం ప్రపంచ సాహిత్యంలో గానీ, తెలుగు సాహిత్యంలో గానీ, అరుదుగానైనా, ఉన్నదే. ప్రసిద్ధ ఇంగ్లీషు నవలా రచయిత, కథకుడు శ్రీ ఎచ్. లారెన్స్ కొన్ని కవితలు. సంపుటిగా వచ్చాయి. తెలుగులో పాలగుమ్మి పద్మరాజు (పాప పేరుతో), బుచ్చిబాబు వంటి కథకులు కవితలు రాశారు. కవితా రచనతో సాహిత్య జీవనం ప్రారంభించిన మరొక ప్రసిద్ధ కథా రచయిత చాగంటి సోమయాజులు.

తెలుగు సాహిత్యంలో 1930, 1940లలో అత్యద్భుత రచనలు, 20వ శతాబ్ధి తెలుగు సాహిత్యానికే తలమానికం అనదగిన రచనలు - వెలువడ్డాయి. సంప్రదాయ వాదులు భావించేలాగ ఇది జాతి అదృష్టమూ కాదు, యాదృచ్ఛికమూకాదు. ఆ సమయంలో ఆర్థిక సంక్షోభం వచ్చింది. రెండ ప్రపంచ యుద్ధం వచ్చింది. ఈ రెండింటిలోంచి ఫాసిజం వికటాట్టహాసం చేసింది. అభ్యుదయ కాముకులైన వారంతా కవులు, రచయితలు, కళాకారులు, మేధావులూ, కార్మికులూ, ఆ పరిస్థితుల్ని సర్వశక్తులతో ఎదుర్కొన్నారు. ఫాసిజం మట్టి కరిచింది. సామ్రాజ్యవాదం ఎదురు దెబ్బలు తిన్నది. రష్యాలోనూ మరికొన్ని ప్రపంచదేశాల్లోనూ సోషలిజం తన ఎర్రజండాను అప్రతిహతంగా ఎగరేసింది. చైనాలో లాంగ్ మార్చ్ జరిగింది. జన చైనా ఆవిర్భావం దిశగా మహోద్యమం జరిగింది.

మన దేశంలో గాంధీ అహింసావ్రతం, ఉప్పు సత్యాగ్రహం అంటూ జపం చేస్తున్నా, ప్రగతి భావాలుగల యువకులు కాంగ్రెసులోంచి సోషలిస్టులుగా విడిపోయారు. భారత కమ్యూనిస్టు పార్టీ ఆవిర్భవించింది. భగత్‌సింగ్ ఉరి, గద్దర్ వీరుల తిరుగుబాటు మొదలైన సంఘటనలు జరుగుతున్నాయి. మార్క్సిజం యువకుల రక్తాని కెక్కింది. అఖిల భారత స్థాయిలో అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడింది. కవులు, రచయితలు కళాకారులు కార్మిక, కర్షక పక్షపాతం చాటుతున్నారు. తెలుగునా ఈ గాలి జోరుగానే వీస్తున్నది.

ఉత్తరాంధ్రలో విజయనగరంలో ముగ్గురు యువకులు వామపక్ష భావజాల ప్రభావంతో నిరంతర సాహిత్య మథనం చేస్తున్నారు. శ్రీరంగం నారాయణబాబు, రోణంకి అప్పలస్వామి, చాగంటి సోమయాజులు. అప్పుడప్పుడు చేరుతున్న మరొక యువకుడు విశాఖపట్నం నుంచి వచ్చి వెళుతున్న శ్రీరంగం శ్రీనివాసరావు. వీరందరిలో వయసులో చిన్నవారు చాగంటి సోమయాజులు (జననం: జనవరి 1915). అందరికందరూ సాహిత్యలోకంలో ఉద్దండులు, ప్రసిద్ధులూ కనుక వారి సాహిత్య కృషి గురించి ఇక్కడ ప్రత్యేకంగా చెప్పుకోనవసరం లేదు. వారి కృషి 20వ శతాబ్ది సాహిత్య చరిత్రలో ఒక ప్రముఖ భాగం.

కథా రచయితగా చాసో ప్రతిభ గురించి కూడా నేను చెప్పనవసరం లేదు. అనితర సాధ్యమైన రచనా శిల్పం అనీ, శ్రామిక జన పక్షపాతి అనీ, ఉత్తరాంధ్ర మాండలికాన్ని కథా కథనంలో అత్యంత సజీవంగా ప్రయోగించిన అతికొద్దిమంది కథకుల్లో ఆయనొకరనీ అందరికీ తెలుసు. ఆయన కవితలు కూడా రాశారని చాలా కొద్ది మందికి తెలుసు. ఆ కొద్ది మంది ఆ కవితల్ని చదివి వుండకపోవచ్చు. కారణం అవి అక్కడక్కడా తప్ప -పుస్తక రూపంలో రాకపోవడమే. చాసో కవితల్ని ఈ తరం పాఠకులకు పరిచయం (అవును పరిచయమే) చేసే ప్రయత్నం చేస్తాను.

చాసో, రోణంకి అప్పలస్వామిగారు ఇద్దరూ శ్రీకాకుళం జిల్లాలోనే పుట్టారు. విజయనగరం ఆనాటి

ఇం. నెం. 12-2-22/10, మహిళా కాలేజి ఎదురు, శ్రీకాకుళం - 532 001.

విద్యాపీఠం గనుక, వేరు వేరు కారణాల వల్ల విజయనగరం చేరుకున్నారు. మహారాజా కళాశాలా విద్యార్థులుగా ఉంటున్న సమయంలో ఇద్దరికీ పరిచయం ఏర్పడింది. అప్పలస్వామి బి.ఏ. తరగతిలోనూ, చాసో ఎమ్.ఏ. లోనూ ఉన్నారు. వారి పరిచయం జీవితాంతం సాగింది. అప్పలస్వామిగారికి ఇంగ్లీషుతో పాటు వివిధ యూరోపియన్ భాషలమీద మక్కువ ఏర్పడింది. ప్రపంచ పోకడను సమకాలిక ప్రపంచ సాహిత్య రీతులనూ అర్థం చేసుకోవాలంటే ఆ బాషలు క్షుణ్ణంగా రావడం అవసరం అనిపించింది. కాశీ విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. ఇంగ్లీషు చదివి తిరిగి వచ్చాక, విజయనగరంలో ఆయా భాషా సాహిత్యాల అధ్యయనం ప్రాంభించారు. స్థలం - విజయనగరంలో మూడు లాంచర్లుకు కూతవేటు దూరం, చిన్నిపిల్లి వారి వీధిలోని చాసోయిల్లు. అది పందొమ్మిదవ శతాబ్ది చివరి భాగంలో కట్టిన చాలా పెద్ద భవనం. ఇతరులకు ఇబ్బంది లేకుండా - మేడమీద ఒక విశాలమైన గదిలో వారు చేరేవారు.

ప్రపంచ సాహిత్య మథనంలోంచి, సమకాలిక సంక్షోభ పరిస్థితుల అవగాహనలోంచి -సృజనాత్మకత అంకురం వేసింది. ఇద్దరూ ఇంగ్లీషులో కవితలల్లనారంభించారు. ఆ కవితల ద్వారా కీర్తి శిఖరాలందుకోవడం అలా వుంచి, ఎంతమది పాఠకుల్ని చేరగలిగాం. వారికి మనం ఏం చెప్పగలిగాం అనే మధన చాసోలో ప్రారంభమైంది. దృష్టి కథ రచన వైపు సారించారు. తొలి 1940లలో - ఆలస్యంగా కొన్ని కవితలు అచ్చయ్యాయి. కొన్ని తొలి కథలూ అచ్చయ్యాయి. కథా రచనలో పట్టుదొరికింది. వెంటనే కొంత గుర్తింపూ వచ్చింది. తృప్తి కూడా కలిగివుంటుంది. కవితా రచన పూర్తిగా మానేశారు.

అప్పటికే స్థానిక పత్రికలు కాక తెలుగుతల్లి, ఆనందవాణి, భారతి, ఢంకా మొదలైన పత్రికలు చాసో కవితలు అచ్చువేశాయి. ఎన్ని కవితలు అచ్చుపడ్డాయో స్పష్టంగా తెలియదు. నేను సేకరించగలిగినవి తొమ్మిది. (ఇందుకు చాసోయే సహకరించారు. సుమారు నలభై సంవత్సరాల తరువాత కూడా కంఠతా వచ్చును!) ఆ తొమ్మిదింటినీ ఒక క్రమంలోఅమర్చుకుని పరిచయం చేసే ప్రయత్నం చేస్తాను.

మేధావులైన కవులూ, కళాకారులూ 1917 నాటి రష్యన్ విప్లవంతో ప్రభావితులయ్యారు. వారికి మార్క్సిజంపై అచంచల విశ్వాసం ఏర్పడింది. సిగ్మండ్ ఫ్రాయిడ్ సైకో-ఎనాలిసిస్ మరొక వర్గానికి చెందిన మేధావుల్ని ప్రభావితం చేసింది. కవిత్వంలో సిసిల్ - డే - లూయిూ, డబ్ల్యు ఎచ్ ఆడెన్, స్టీవెన్ స్పెండర్, లూయి ఆరగో మొదలైన కవులు కమ్యూనిస్టు సిద్ధాంత ప్రభావంతో రచనలు చేస్తుండగా, చిత్రకళలో పాబ్లో పికాసో వంటి వారు అత్యద్భుత కళాఖండాన్ని సృష్టించి సంచలనం తీసుకువస్తున్నారు. సమాజపు అట్టడుగు పొరల్లోని మాలిన్యాన్ని క్రౌర్యాన్నీ ఎండగడుతున్నారు. రష్యాలో స్టాలిన్ పాలన సాగుచున్నది. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు మొత్తంగా క్లిష్ట పరిస్థితుల్నెదుర్కొంటున్నారు. కిప్లింగ్ కీర్తించిన రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం మబ్బులు పట్టి, చివరికి కుంగిపోక త్పని పరిస్థితులు ముంచుకొస్తున్నాయి. రెండ ప్రపంచయుద్ధం, ఆర్థిక మాంద్యం - భారతదేశం వంటి పేద దేశాన్ని మరింతగా ఆకలి మంటల్లో ముంచాయి. భారత దేశంలోనూ, ఆంధ్ర ప్రాంతంలోనూ, కమ్యూనిస్టుపార్టీ ఏర్పడి పేదవర్గాల్లో పనిచెయ్యడం ప్రారంభించింది. కాంగ్రెసు సుడిగాలిలో కొట్టుకుపోతున్న వాళ్లకి గాంధీ ఆదర్శంకాగా, కొత్తరక్తం ఉరకలు వేసే యువకులకు భగత్‌సింగ్, గద్దర్ వీరులు ఆదర్శ ప్రాయులయ్యారు. గుండెల్లో సోషలిజం నిండింది. మార్క్సిజం సాధించవలసిన గమ్యంగా మారింది.

సాంప్రదాయిక పదాల్లో, పురాణ గాథల్లో, పత్రికల్లో - అభ్యుదయ దృక్పథంతో కూడిన కొత్త అర్థాలు తీయడం ప్రారంభించారు, ఆనాటి కవులు. శ్రీరంగం నారాయణబాబు, సంప్రదాయ పదబంధాల్లో సంప్రదాయ వ్యతిరేక అభ్యుదయ సంకేతాలు ప్రసారం చేస్తున్నాడు.

చాసోదీ ఆ బాటయే. "ధర్మక్షేత్రము" అనే కవితలో రెండవ ప్రపంచయుద్ధం బీభత్సాన్ని ఇలా చిత్రీకరించారు.

"విగత ప్రాణులౌ
విభులపైబడి
వెర్రెత్తిన యువిదల
యుద్ధాంతర
హృదయ దళన
రోదనార్తులు
విహాయసానికి మొత్తముగా
దబదరోంరబదరోం
హరోం, హరోం
సోహం, సోహం"

- అనే నినాదాలుగా వినపడ్డాయట. "హరోం హరోం" అన్న సంప్రదాయిక పదాలు శకట రేఫ ప్రయోగంతో, హ్రస్వాంతంగా "హఱం హఱం"గా మారాయి. ఈ కవితలోనే "ధనుష్టం/కారము" అనే విరుపు కూడా కనిపిస్తుంది. (ఒకే పదం రెండు పాదాల్లో) సంప్రదాయాన్ని వ్యతిరేకించాలనే పట్టుదలతో వైరి సమాసాలనూ, దుష్ట సమాసాలనూ ఆనాటి కొందరు కవులు విరివిగా ప్రయోగించారు. అనుచిత విభాగం చేశారు. తమ లక్ష్యం సాధించడం కోసమే, పాఠకులలో ఒక విశిష్ట భావావిష్కరణ కోసమే వారా పని చేశారు. (ఈ విషయం స్పష్టంగా అర్థం చేసుకోలేకనో, సౌకర్యం కోసం గుర్తించడం మానేసో, నారాయణబావాలను అకవి అన్నారు కొందరు విమర్శకన్మన్యులు! యుద్ధ బీభత్సమే కాదు జీవిత బీభత్సాన్ని వ్యక్తీకరించడానికే ఈ పద్ధతి బాగా ఉపకరించింది. ("ధర్మక్షేత్రము" అనే కవిత భారతి, 1941, జూన్ సంచికలో అచ్చయింది).

సంప్రదాయ, పౌరాణిక ప్రతీకల్ని వాడకుండా కూడా అలతి, అలతి పదాల్తో, బ్రతుకులోని గడ్డు వాస్తవాన్ని బొమ్మ కట్టించగల నేర్పు చాసోకు వుంది. పనీ పాటాలేనివారు, తప్పని పరిస్థితుల్లో సోమరిపోతులైనవారు-

"అరుగులకు అతుక్కుపోయి
అడ్డం! చీశాట, చీట్లాట
చచ్చాట చదరంగం
చీడా చీడన్నర చీడా"

చీడలాంటి నిరుద్యోగం, నిర్వ్యాపారం, అర్థం లేని ఆటలు, నిరుపేదల దైనందిన కృత్యం-

'జీవితంలో చలనం లేదు
జీవితంపై చైతన్యం లేదు
అరక్క తరక్క
ప్రవాహంలా కొట్టుకు పోక
ఏట్లో నిలబడ్డ
బండరాయి బ్రతుకు!

ఊరిమీద డంబం
ఊళ్ళో పోరు
ఇంట్లో ఈసురోమని - ఇల్లాలు
తాళ్ళలా వేళ్ళాడుతూ - పిల్లలు
బతికే విధం లేదు
బతుకు తెలివి లేదు
ఈడుస్తూ కాపరం
ఏడుస్తూ బతుకు"

సోమరితనం చాలా మంది అనేకునేటట్లు వ్యక్తి లక్షణం కాదు. సమాజంలోని విస్తృత పరిస్థితుల ప్రభావమే అది. చేతినిండా పని వుండి, పుష్కలంగా ధనం ధాన్యం వుంటే జీవితం నిత్య కళ్యాణం పచ్చతోరణంలా వుండేవారు. సోమరులయ్యేవారు కారు. సోమరిగా వుందామన్నా పరిస్థితులు వుండనివ్వవు. కష్టించి పని చేసుకునేందుకు సిద్ధంగా వున్నా ఏ పనీ లేకపోవడం వ్యక్తిగతం ఎలా అవుతుంది? ఇప్పటికీ పట్నాల్లో రోడ్డుమీద, రైల్వేస్టేషన్లలో, బస్సు కాంప్లెక్సుల దగ్గర అదే పనిగా పడి నిద్రపోయేవాళ్ళు కనబడతారు. వాళ్ళ సోమరితనం కనపడుతుంది. ఎండిన డొక్కలు కనపడవు. వ్యవస్థ వికృత స్వరూపం కనపడదు. సమాజ దోపిడీ స్వభావం కనపడదు. మధ్యతరగతిలో అట్టడుగు వర్గం వారిదీ దాదాపు ఇదే జీవితం. ఒక రోజు

తింటే నాలుగు రోజులు పస్తు. అరుగులమీదా, రోడ్ల మీదా, చెట్ల క్రిందా పనికిమాలిన చీట్లాటలూ, చింత పిక్కలాటలూ ఆడుతూ కనిపిస్తారు. వాళ్ళకి ఇళ్ళల్లో ఈసురోమనే ఇల్లాలూ, తాళ్ళలా వేలాడుతూ పిల్లలూ తప్పక వుంటారు. పిల్లలు తాళ్ళలా వేళ్ళాడడం భయంకర దృశ్యం! 'బ్రతుకు' అనే ఈ కవిత రచనా కాలం 1938-40 మధ్య. రెండవ ప్రపంచయుద్ధ కాలం. ఇది ఆలస్యంగా 1944 డిసెంబరు "తెలుగుతల్లి" పత్రికలో అచ్చయింది. (ఇలా ఆలస్యంగా అచ్చు కావడానికి కారణం రాసిన వెంటనే రచన పత్రికలకి పంపే అలవాటు లేకపోవడం, పైగా ఈ కవితలపై కవికే తగినంత తృప్తి లేకపోవడం).

రెండవ ప్రపంచ యుద్ధంలో పెట్టుబడిదారీ దేశాలు స్వప్రయోజనాలకోసం ప్రపంచ ప్రజల్ని నిరంతర ఘోర మరణ భయంతో పట్టి పీడిస్తున్న రోజుల్లో, 1940-43 ప్రాంతాలలో బర్మాపై జపాన్ బాంబులు పడ్డాయి. అంతకుముందు బ్రతుకు తెరువుకోసం బర్మా (రంగం) వెళ్ళినవాళ్ళు మళ్ళీ బర్మానుంచి కట్టుబట్టలతో కాలి నడకతో పుట్టి పెరిగిన తెలుగు నేలకు తిరిగి వచ్చారు. వాళ్ళు అనుభవించిన ఘోరాలు సొంత నేలమీదనే ఎదురయ్యాయి. కన్నతల్లిలా కడుపులో పెట్టుకుంటుందని ఆశించిన ఉన్న ఊరు కన్నీటిమయంగా కనిపించింది.

"బతకాలని వెళ్ళావు
బాంబుల్లో పడ్డావు
బతికొచ్చినావా
నా నాయనా!
నిరుడెల్లిపోనావు
నేడొచ్చినావు
నడిసొచ్చినావా
నా నాయనా!
కొండలెక్కొచ్చినా
కోనల్లో నడిసినా
కట్టెతోటొచ్చావా
నా నాయనా!
మారు రైతుకుపోయె
మన సాగుభూమిరో
మారు మనుముకుపోయె
నీ బిడ్డ తల్లిరో
నేనేమి సేతురా
నా నాయనా!
నిన్ను నమ్ముకు మేము
నిలబడే ఉన్నాము
నిప్పు లేకున్నాము
నీకేటి పెట్టేది
నా నాయనా!"

బతుకుతెరువుకోసం బర్మా వలస వెళ్ళిన కొడుకు ఏడాది తరువాత బాంబుల్లో పడి, కొండల్లో నడిచి, కోనల్లో నడిచి బ్రతికి బట్టకట్టి కట్టెతో తిరిగొచ్చాడు. అతనితో తల్లి కష్టాలు చెప్పుకుని శోకాలు తీస్తున్నది. మన సాగుభూమి మారు రైతుకు పోయిందిరా,బతుకు గడవక బిడ్డ తల్లి నీ పెళ్ళం మారు మనుముకు పోయిందిరా, నువ్వు రంగం వెళ్ళావు ఏదో ఇంత సంపాదించి తెస్తావని ఆశతో ఇంతకాలమూ నిలబడి వున్నాము. పొయ్యిలో నిప్పు లేదు, ఈనాటికి వచ్చేవు. నీకేటి పెట్టేదిరా నాయనా. అని ఆ తల్లి హృదయ విదారకంగా ఏడుస్తున్నది. కవిత చదవడం పూర్తయ్యేసరికి ఒక దుఃఖభావం పాఠకుడిలో పెరుగుతుంది. సున్నిత మనస్కులకు కళ్ళనీళ్ళు చిమ్ముతాయి. ఇటువంటి దృశ్యాలు ఆ రోజుల్లో అన్ని పల్లెల్లోనూ కనపడుతూనే వుండి వుంటాయి. మానవుల, ముఖ్యంగా పేదల కష్టాలకు కర్మ కారణం కాదు, గ్రహపాటూ కారణం కాదు. పాలక వర్గాల దుష్టవర్తనే కారణం. ఇది తెలియక చాలా మంది తమను తాము నిందించుకుంటారు. మేధావి వర్గానికి చెందిన సంప్రదాయవాదులు, మతవాదులు అవును కర్మే కారణం, జీవుని వేదనకు పూర్వజన్మ కృతమే కారణం అంటూ పురాణ గ్రంథమాలలు రచిస్తారు. చాసో వంటి అభ్యుదయ రచయితలు వాస్తవం కళ్ళకు కడతారు. ప్రజల్లో చైతన్యం కలిగిస్తారు.

దీనిని చాసో కవితల్లో ఉత్తమమైనదిగా భావించవచ్చును. 1942 ప్రాంతాల్లో రచించిన ఈ కవిత ఆలస్యంగా 'తెలుగుతల్లి', 1945 సెప్టెంబరు సంచికలో ప్రచురితమయింది. కె.వి. రమణారెడ్డిగారు దీనిని "అడుగుజాడ గురజాడది" అనే కవితా సంకలనం (1962)లో చేర్చారు.

ప్రకృతి దృశ్యాన్నీ, జీవిత దృశ్యాన్నీ కలగలిపి జీవిత వాస్తవాన్ని రూపుకట్టించగల నేర్పు చాసోకు ఉన్నది. "వంతెనపైన" అనే కవితలో శ్రీకాకుళంలోని నాగావళి వంతెన పైనుంచి కనిపించే దృశ్యాన్ని ఇలా వర్ణించారు.

"సాగర గానము
సన్నని శృతిలో
శ్రవణము సోకింది
నాగావళి
నాగ స్వరమూదుతు
రాగము తీసింది
నురగలతో
తరగలు ఉరగాలై
పడగలనెత్తుకు పరిగెత్తాయి"

ఇది నదీ ప్రవాహ దృశ్యం. నాగావళి శ్రీకాకుళం జిల్లాలోని పెద్ద నదుల్లో ఒకటి. శ్రీకాకుళ పట్నం దాటి కళ్ళేపల్లి దగ్గర బంగాళాఖాతంలో కలుస్తుంది. ఇతర ప్రాంతాల్లో ఎప్పుడైనా ఎండిపోయినా శ్రీకాకుళ పరిసర ప్రాంతాల్లో ఎండాకాలంలో కూడా కొంత నీరుంటుంది. నదికి అవతలి ఒడ్డు గుజరాతీ పేట, హయాతీనగరం ఇవతలి ఒడ్డు శ్రీకాకుళం. ఈ రెంటినీ కలుపుతూ బ్రిడ్జి వుంది. ఈ బ్రిడ్జి మీద నిలబడితే నిశ్శబ్ద సమయాల్లో అల్లంత దూరాన (4 కి॥మీ॥)సాగర గానం వినిపిస్తుంది. బాగానే వుంది దృశ్యం. కంటికే కాదు చెవికి కూడా ఇంపుగా వుంది. ఆ తరువాత -

వారధి దాటుచు
వర్తకమంతా
బస్తాలలో
బళ్ళ దారిగా
శ్రీకాకుళానికి
చీకట్లన్నీ
చించుకుపోతుంది
ఎలనాగలతో
ఎడారి చూపులతో
రైతులు
కష్టించే కాళింగులు
కనపడ్డారు
చిగురులు పెట్టిన చీకట్లో
వంతెనపైన
వాయువులో"

బ్రిడ్జి మద్రాసు-కలకత్తా నేషనల్ హైవే (నెం.5) మీద ఉన్నది. (ఇది పాత బ్రిడ్జి. చాసో వర్ణించింది ఈ బ్రిడ్జి గురించే. ఇటీవల మరొక కొత్త బ్రిడ్జి వచ్చినా, పాత బ్రిడ్జిమీద దృశ్యం ఈనాటికీ ఇదే) పల్లెలోని పంటంతా బస్తాలలో వారధి దాటి చీకట్లన్నీ చించుకుని శ్రీకాకుళానికి పోతుంది. పంటల్ని సృష్టించిన కష్టించే కాళింగ రైతులు మాత్రం చిగురులు పెట్టిన చీకట్లో వుండిపోతారు. (చీకటి చిగురు పెట్టడం మంచి వ్యక్తీకరణ) ఒక అందమైన ప్రకృతి దశ్యం - వెన్వెంటనే దోపిడీ దృశ్యం! శ్రీకాకుళం జిల్లాలోని రైతుల్లో నూటికి తొంభయిమంది కాళింగ కులస్తులు. వీరిలో మళ్ళీ కింతలి కాళింగులనీ, బూరగాని కాళింగులనీ రెండు రకాలు. వీరి ప్రధాన వృత్తి వ్యవసాయం. (జంధ్యం వేసుకుంటారు. ఎక్కువమంది వైష్ణవ మతస్తులు. పాత తరాలకు చెందినవారయితే శాకాహారులు) వీరిలో కొందరు మోతుబరులు పెద్దరైతులు లేకపోలేదుగాని, అధిక సంఖ్యాకులు పేదలే. (ఇప్పుడు పరిస్థితుల్లో కొంత మార్పు వచ్చిందిగాని 1935-40 ప్రాంతాలనాటికి వారి పరిస్థితులు బాగులేదు. 1964లో కాళీపట్నం రామా రావుగారు యుద్ధం కథ రాసేనాటికి కూడా పరిస్థితులు దాదాపు అలాగే వున్నాయి). రైతుల కష్టం పట్నం వెళ్ళే సరుకుగా ఎలా మారిపోతుందో చూపించారు చాసో ఈ

కవితలో. దీన్ని రోణంకి స్వామిగారు ఇంగ్లీషులోకి అనువదించారు. 1950ల్లో ఒక సావనీర్‌లో అచ్చయింది. తరువాత వారి కవితా సంపుటిలో చేరింది.

"పాలకొండ" అనే మరో కవితలో శ్రీకాకుళం జిల్లాలోని పాలకొండ గ్రామ పరిసరాల ప్రకృతిని వర్ణిస్తూనే సామాజిక స్పృహను ప్రదర్శించారు చాసో. నాగావళి నది పాలకొండ మీదుగా ప్రవహిస్తుంది.

"ఏడ్పే పరిగెడుతుంది
ఏరై
నూరు మైళ్ళ ఏడుపు
నాగోరు నుండి
నాగావళిగా

వివాహమాడిన
వెర్రిజివ్వికి
విడాకులిస్తూ
లతామతల్లి
లాలిత్యంగా
కౌగిలించుకుంది
కారు తాటిని
కామాంధయై"

నాగోరు అంటే పాలకొండ సమీపంలోని నాగూరు అగ్రహారం అయి వుంటుంది. నాగావళి నడకను ఏడ్పే ఏరై పరుగెడుతుందనడం, కారు నల్లని తాటిచెట్టును తరులతలు కామాంధంతో కౌగిలించుకోవడం - అందమైన పదచిత్రాలు.

"శిథిలాల్లో" అనే కవితలో శిథిలాలలో సైతం జీవం ఎలా తొణికిసలాడుతుందో ప్రకృతి రహస్యాల్ని వివరిస్తారు. ఇందుకు తెలుగునాట ప్రచారంలో వున్న ఒక కథని తీసుకున్నారు చాసో

"గిలిగిచ్చలా పూసి
నిలుచుంది
జిల్లేటి
జేబు!
మీటుతోంది
గోటు
కింకిణీ
కిన్నెర!

రిమ్మెత్తినది
తుమ్మెద"

శిథిలాలుంటాయి. ఆ శిథిలాల్లో జిల్లేడు చెట్లు, ఉమ్మెత్త చెట్లు మొలుస్తాయి. ఆ జిల్లేడు చెట్టు చెట్టంతా పూలు పూసి గిలిగిచ్చలా వుంది. ఉమ్మెత్త పూలలో మకరందం తాగిన తుమ్మెద రిమ్మెత్తిందట. ఆ ప్రాంతాల్లో సన్నని సంగీతం కూడా వినిపిస్తోంది. గాలి తెరల్లోంచి - అది గోటితో మీటుతున్న కింకిణీ కిన్నెరలా వుంది. ఇదీ దృశ్యం. భావకవులు మల్లెలు వర్ణిస్తారు. పారిజాతాలు వర్ణిస్తారు. అభ్యుదయ కవి చాసో శిథిలాల్లో మొలిచిన జిల్లేళ్లు, ఉమ్మెత్తలు వర్ణించారు. మందార మకరంద మాధుర్యమున తేలవలసిన తుమ్మెదలు - ఇక్కడ ఉమ్మెత్తలలోని తేనె తాగి రిమ్మెత్తాయి. చూడగల కన్నువుంటే శిథిలాల్లో కూడా జీవం వుంటుంది. ఏ శిథిలాల్లో చూసినా జిల్లేళ్ళు ఉమ్మెత్తలు కనిపిస్తాయి..

"కూతురోరచ్చి
కూతురో రచ్చంది
పరమానందంగా
పక్కైన
అచ్చమ్మ
పల్లేరులపై
నల్లేరులపై
పూలలో
రెక్కలు కట్టుకు
ఎగురుతోంది
ఆనందం
సీతమ్మ వారి కోకల్లా

చిలకలై!"

తెలుగు పల్లెల్లో అచ్చుమ్మ కథ ఇప్పటికీ ప్రచారంలో వుంది. చిన్నప్పుడు అందరిలాగానే నేనూ విన్నాను. ఒక తల్లి ఇప్ప పువ్వు ఎండబోసి కూతురును కాపలా వుంచి తన పనిమీద తను వెళ్ళింది. పొట్ట తిప్పలకోసం వెళ్ళింది. సాయంత్రం ఇంటికి వచ్చి చూస్తే ఇప్ప పువ్వు బాగా తరగిపోయింది. ఇదేమని కూతురును అడిగింది. పాపం చిన్న పిల్ల ఆ కూతురేం చెబుతుంది గాలికి ఎగిరిపోతుంటే చూస్తూ కూచున్నావా? ఇంత అశ్రద్ధేమే - అని సాధించింది. నిజమే మరి. రెక్కలు ముక్కలు చేసుకుని ఏరుకు వచ్చిన పువ్వు. మర్నాడు మళ్ళీ బయటికి వెళుతూ జాగ్రత్త జాగ్రత్త సుమా అని కూతురును హెచ్చరించింది. ఆ సాయంత్రం కూడా మళ్ళీ తగ్గిపోయింది పువ్వు. కూతుర్ని నానా తిట్టూ తిట్టింది తల్లి. నాకేపాపమూ తెలీదు. నేను కంటిరెప్పలా ఇప్పపువ్వును కాపలా కాసేనూ అంటుంది కూతురు. ఆ మర్నాడూ ఆ మర్నాడూ అదే కథ. తల్లికి ఒళ్ళు మండి కూతుర్ని తన్ని తరిమేసింది ఇంట్లోంచి. కూతురుక్కూడా ప్రాణం నొచ్చి ఇల్లు వొదిలిపెట్టి పోయింది. మళ్ళీ అడవినుంచి ఇప్ప పువ్వు తెచ్చి ????? కూర్చుంది తల్లి. సాయంత్రానికి ఇప్ప పువ్వు తరిగింది. ఆ మర్నాడు ఇంకా తరిగింది. ఆ మర్నాడూ అంతే. తల్లికి వాస్తవం తెలిసివచ్చింది. పువ్వు ఎండితే తగ్గిపోక ఏం చేస్తుంది! అయ్యో కూతుర్ని నానా మాటలూ ఆడి ఇంట్లోంచి తరిమేశానే - అని ఆ తల్లి ప్రాణం విలవిలలాడింది. కూతురో అచ్చీ కూతురో రచ్చీ అని ఏడుస్తూ కూతుర్ను వెదుక్కుంటూ బయల్దేరింది. కొండలూ, కోనలూ తిరిగింది. ఇంకెక్కడి కూతురు? ఎటుపోయిందో ఏమో. చివరికి తిరిగి తిరిగి పక్షిలా మారిపోయింది. ఏడుపు - పక్షి అరుపులా మారిపోయింది. ఆ తల్లి పక్షిలా తిరుగుతూనే వుందట కూతురుకోసం.....ఈ కథను పల్లెలో ముసిలమ్మలు మరింత రసవంతంగా చెపుతారు. వింటే కథ చివరికి ఎవరికయినా కన్నీళ్లు రావలసిందే. కథకుడు కూడా అయిన చాసో ఈకథను సంక్షిప్తంగా ప్రతిభావంతంగా తన కవితలో ఇముడ్చు కున్నారు.

ఒకపక్క యుద్ధ భీభత్సం, మరొకపక్క తెల్లవాడి పాలనలోని భీభత్సం ప్రజానీకాన్ని పట్టి పీడిస్తున్నాయి. యుద్ధ ఖర్చులకోసం పన్నులమీద పన్నులు వేస్తున్నారు బ్రిటీష్‌వాళ్ళు. ఆర్థిక సంక్షోభం, కరువు, ధరల పెరుగుదల జీవితం క్రూరంగా, ఘోరంగా వుంది. ఆ సమయంలో సాహిత్యకారులు మాత్రమే భావ కవిత్వపు సితారలు మీటగలుగుతారు. మానవత్వంగలవారు మాత్రమే అభ్యుదయ కవిత్వం రాస్తారు. చైతన్య గీతాలు రాయగలరు. 1938-40ల ప్రాంతాల్లో భావ కవిత్వం మీద అభ్యుదయ కవులు తిరుగుబాటు చేశారు. పఠాభి 'ఫిడేలు రాగాలడజన్' మొత్తంగా భావకవిత్వంపై తిరుగుబాటే. శ్రీరంగం నారాయణబాబు రాసిన 'ఊహా ఊర్వశి' అనే కవిత భావ కవిత్వంపై తిరుగుబాటే. బైరాగి 'నాక్కొంచెం నమ్మకమివ్వు' ఇటువంటిదే. "రాత్రి" అనే కవిత రాసి చాసో చేసిందీ ఆ తిరుగుబాటే.

"భవిష్యత్తులా
అగమ్య గోచరంగా
ఆకాశం
అక్కడక్క
డాశల్లా
చుక్కలు
ఆమధ్య
బూజెక్కిన
అక్షయ్య పాత్రలా
అర్ధచంద్రుడు
గూడుకట్టాడు"

అభ్యుదయ కవులకు ఆకాశం నీలంగా, నిర్మలంగా కనపడటం లేదు. భవిష్యత్తులాగ అగమ్యగోచరంగా కనిపిస్తున్నది. అక్కడక్కడ చుక్కలు ఆశల్లా మినుక్కు మినుక్కుమంటున్నాయి. ఆ మధ్య అర్ధచంద్రుడు గూడూకట్టి అక్షయ పాత్రలా వున్నాడు.

శంపాలతాదేవి

పాశ్చాత్యగానాన్ని
పాటగారాస్తే
ఉరుముతూ
ఊగేయి
ఊరగాలుల్లు
తిన్నవాడెవడోనో
తేన్చి
"నారాయణా"అని
ఆవులిస్తే
కులాసాని
కూసింది
గూడు గుడిసేటు

మెరుపులూ, ఉరుములూ, ఊరగాలులూ, ఆ బీభత్ససంగీతం అర్థం కాని భయంకరమై పాశ్చాత్య గానంలా వుంది. అంతటా కల్లోలం. సామాన్య మానవుడి జీవితం ఇలా వుండగా, హాయిగా తినికూచున్నవారు తేన్చి ఆవులిస్తున్నారు. గుడ్లగూబ కులాసాగ కూసింది. ఒక గుడిసేటు కులాసా కూనిరాగం కూస్తున్నది. దీన్నే వ్యంగ్యంగా చెప్పారు. ప్రకృతి బీభత్సంలో గుడ్లగూబలు కుయ్యటాన్ని జీవిత బీభత్సంలో వ్యభిచారి కులాసాగా కుయ్యటంగా చిత్రించారు. ప్రకృతి దృశ్యాల్లోంచి సామాజిక వాస్తవాన్ని కళ్లకుకట్టారు.

పదాల్ని విచరడంలో చాసో కొత్తధ్వనుల్ని సాధించారు. "భవిష్యత్తువలె రాత్రి అగమ్యగోచరంగా వుందని చెప్పడం" అక్కడక్కడ ఆశల్లావున్న చుక్కలమధ్య అక్షయపాత్రలో చంద్రుడు గూడుకట్టడం విలక్షణమైన పదచిత్రాలు. ప్రాచీన సాహిత్యంలోగాని ఆధునిక సాహిత్యంలోగాని "రాత్రి"ని సామాజిక దృక్కోణంలోంచి వర్ణించిన కవితాఖండికలు చాలా అరుదుగా వుంటాయి. భావకవులకు అధారంగా కనపడే దృశ్యాలన్నీ, సామాజిక వాస్తవాన్ని దర్శించే అభ్యుదయ కవులకు బీభత్సభయానక దృశ్యాలే. భావకవిత్వంపై తిరుగుబాటుగా, నిరసనగా రాసిన కవిత ఇది. దీన్ని కూడా రోణంకి అప్పలస్వామిగారు ఆంగ్లభాషలో కవిత్వీకరించారు.

భక్తిభావం క్రమంగా తగ్గి హేతువాదదృక్పథం మార్క్సిస్టు దృక్పథం పెరుగుతున్న రోజులనాటి చాసో మానసిక పరిణామాన్ని సూచిస్తుంది. "వినాయక స్తుతి" అనే కవిత. ఇది కూడా 1940లలో రాయగా అప్పట్లోనే ఆంధ్రపత్రికలోనో ఆనందవాణిలోనో అచ్చుపడింది.

"విరిగిన హరివిల్లు" పాడుకుందుకు కూడా అనువైన కవిత. మధ్య తరగతి, పేదవర్గపు జీవిత దృశ్యాలే ఇందులోను కనిపిస్తాయి.

"అల్లుడిగా రార్భాటం మేడింటిలో
పిల్లలగగ్గోలు గుడిసింటిలో
అల్లాహో అక్బరు మసీదులో

కూతురితో సాంగత్యం సానింటిలో
పొంగుడ్లు పెట్టింది వల్మీకంలో
మృత్యువుతో పోరాటం ఆస్పత్రిలో
దేముడు తిరిగాడు దివిటీలతో!"

గుడిసింటిలో పిల్లలు గగ్గోలు పెడుతుంటే, మేడింటిలో అల్లుడి ఆర్భాటం. ఇవి పట్టించుకొనని మతం మసీదులో అల్లాహో అక్బర్ అంటూ ప్రార్థనలు చేస్తుంది. చక్కని చుక్కలతో కులుకుతారు కొందరు కలిగినవాళ్ళు! సానింట్లో కూతురు వయసున్న అమ్మాయితో సాంగత్యం. కొందరు ఆస్పత్రిలో మృత్యువుతో పోరాటం మరికొందరు. ఇవి పట్టని దేముడు దివిటీలతో ఊరేగుతుంటాడు.

వ్యవస్థలోని వైరుధ్యాన్ని చక్కగా చిత్రించారు చాసో.

దొరికిన మేరకు చాసో కవితల్ని ఉదహరిస్తూ సామాన్య పాఠకులకు పరిచయం చేశాను. మార్క్సిస్టు విమర్శనా పద్ధతిలో ఈ కవితల్ని మరింత వివరంగా విశ్లేషించవచ్చును. ఆ పని ఈ వ్యాసపరిధికి మించినది. భవిష్యత్తులో విమర్శకులెవరైనా ఆ పనికి పూనుకుంటారని ఆశిద్దాం.

అభ్యుదయ దృక్పథం చాసో కవితలకు (కథలకు కూడా) హృదయం వంటిది. సంప్రదాయ పదబంధాన్ని అభ్యుదయ భావ వ్యక్తీకరణకు ఉపయోగించుకోవడం వాస్తవాన్ని విడిచి ఊహాలోకాల్లో విహరించే భావ కవితపై తిరుగుబాటు, నిరసన ఈ దృక్పథంలో అంతర్భాగాలు. సమకాలిక సంఘటనలకు స్పందించడం కూడా ఇందులో అతి ముఖ్య లక్ష్యం (కథలకూ ఈ లక్షణమే వర్తిస్తుంది) పదాల్ని విచిత్రంగా విరిచి ఒక ప్రత్యేక ప్రయోజనం సాధించడం చాసో ప్రత్యేకత. కాందిశీకులు, రాత్రి, వినాయక స్మృతి - మొదలైన కవితలు మినీ కవితల్లా వుంటాయి. పదాల విరుపు, వైరి దుష్ట సమాసాలు ప్రయోగించడం, - సారానికి అనుగుణమైన రూపాన్ని మలుచుకోవడం కోసమే.

ఈ లక్షణాలు ఆనాటి మరికొందరు కవుల్లో కూడా వుండేవి. ఈ కవితలు సేకరిస్తున్న దశలో వీటిని శ్రీరంగం నారాయణబాబు, ఆరుద్ర మొదలైనవారి కవితలుగా పొరపాటు పడ్డాను. చాసో ముద్ర అర్థం చేసుకున్నాక పొరపాటు గ్రహించాను. ఈ పని బహుశా ఎవరైనా ప్రాథమిక దశలో చేస్తారేమో - రూపంలో ఉండే దగ్గర పోలికల వల్ల.

1979-85 మధ్యకాలంలో నేను "అవగాహన" అనే పత్రిక(వంటిది) నిర్వహించాను. అందులో చాసో, రోణంకి అప్పల స్వామిగార్ల రచనలు ప్రచురిస్తుండేవాడిని. చాసో కవితల్లో - ధర్మక్షేత్రము, రాత్రి "అవగాహన" ద్వితీయ సంచిక (1979)లోనూ, శిథిలాల్లో, పాలకొండ వంతెనపైన అవగాహన అయిదవ సంచిక (1983) లోనూ ప్రచురించాను. అందుకు చాసో సహకరించారు. కొన్నిటిని చాసో వివరించారు. విజయనగరం చిన్న పల్లివారి వీధిలో వారి యింట్లోనో, గంట స్తంభం సమీపంలోని (న్యూ పూర్ణా టాకీస్ ఎదురుగా) ప్రకాశం పార్కులోనో, లేకపోతే లెన్‌లక్ పార్క్‌లోనో కూచుని ఆయనచేత కవిత్వం పాఠాలు చెప్పించుకోవడం మంచి అనుభవం. 1985లో చాసో కవితలపై - ఆయన సప్తతిపూర్తి సాహితీ సంచిక (విశాఖ సాహితి ప్రచురణ)లో ఒక వ్యాసం, విశాలాంధ్ర ఆదివారం అనుబంధం (జనవరి 1985) లో ఒకవ్యాసం ప్రచురించాను. ఆ వ్యాసాల్ని మరికొంత విస్తరించి ఇప్పుడీ వ్యాసం రాశాను.

చాసో కథల్లో కవితా ఛాయలు లేకపోలేదు "పరబ్రహ్మము" అనే కథలో "ఆలోచన చిక్కుడుతీగలాగ శీతగాలికి పువ్వు తొడిగింది" అనే వాక్యం కవిత్వమే. "కొండగెడ్డ" కథలో 'కొండంతా వర్షంతో నాని ముద్దవుతుంది' ' అనే వాక్యం కవిత్వమే. ఇలా కథలు నిదానంగా చదవుతూ వెళుతుంటే దోవ పొడుగునా కవిత్వం మెరుపులు కనిపించకపోవు. కవిత్వంలో కథనం ఎంతవరకు ఉపయోగించవచ్చునో, కథలో కవిత్వం ఎంతవరకు ఉండవచ్చునో చాసోకి తెలిసినంతగా ఇతర కథకులకు తెలియదు. కథల్లో కవిత్వం గుప్పించి బిగిచెడదీసినవాళ్ళు కొందరు. కవిత్వంలో కథలు మొదలుపెట్టి కవితా శిల్పాన్ని పల్చన చేసినవాళ్ళు కొందరు. "చాసో కథల కవితా ఛాయలు" అనే వ్యాసం ఎవరయినా రాస్తే అది మంచి ప్రయత్నమే అవుతుంది.

చాసో సాహిత్య వ్యాసంగం అర్ధ శతాబ్దం పైగా కొనసాగింది. (స్థూలంగా 1940-1993) ముందు చాసో రచనలన్నీ, కవితలూ కథలేకాదు - లేఖలూ ఒక నాటకం కూడా సేకరించి సమగ్రంగా ప్రచురించాలి. మార్క్సిస్టు దృక్పథంలో విపుల పరిశోధన జరగాలి. చాసో సాహిత్యాను శీలనం అంటే, 20వ శతాబ్దపు సాహిత్య చరిత్రలో ఒక ప్రధాన అధ్యాయం అన్నమాట. ఆవిధమైన పరిశీలనకూ, అధ్యయనానికీ నా ఈ వ్యాసం సహకరిస్తే నేను సంతోషిస్తాను.

# కవితా వీథి

## త్రయోదశ సర్గము

- ఊట్ల కొండయ్య

నాటి చంద్రుడు కురియు జ్యోత్స్నలను తడిసి
యా యయోధ్య తోచె హిమనగాంక మట్లు
కలలయం దొక మౌని యాగమన మరసి
వేగున పురీజనము లేచె వెరగు పడుచు.

ఆయుషస్సున రాజసౌధాంతరమున
నలు దెసల వోలె తాను తమ్ములను గూడి
యొడ లెరుంగక కూర్కు రాముడు. "మహాత్మ!
యిదుగొ! వచ్చితి" నని పల్వరించి లేచె!

సౌవిదల్లుడు విని ముఖ్యసేవిక గని
యంపెదో పోయెదో కయికమ్మ తల్లి
మందిరమ్మున కీవర్త మాన మొసగ
ననగ, నగుచు, నేమి వలయు నీ కనుచు నామె 3.

పిలిచె చేసన్న, దరిసిరి చెలియ లిరువు
రొకరు గజమట్లు, హంసమ ట్లొకరు నడచి
నలుదెసల దివ్వె లిచ్చు ఛాయలను వారు
నట్టువ మొనర్చుచు వచ్చునట్టు తోచె

ముఖ్యసేవిక పరిహాసమునకు కడగి
నడువనగు నాకు కైకేయి కడకు, వినుడు
పూర్వ పుష్పబాణు డితండు, పూవు బ్రోండ్లు
వలయునట, యిర్వురొ, యెకర్తొ తెలిసికొనుడు

అనుచు నామె నవ్వె, విని నవ్వి రింతులు
నగవు పుక్కిలి వెడలకుండంగ మూసి
పెదవు లరచేతులందు, సౌవిదుడు నూర
కొనెనె? యెదురు దాడికి పూనుకొని వచించె

కొలువు పవలు మగని కీమె కొలువు రేల
నది యొకటి నద మొక్కటి ముదితలార!
సంగమము మాట స్వప్న ప్రసంగ మాయె
నందుచే మత్తకాశిని యాయె నీమె!

అనుడు, నల్వురు నగ వంగిళ్లలో దాచు
కొన యతింప నదియు వినక నుబుక
ముకులు విచ్చె, నధరములు బిగ్గరాయె, క
నులు చెమర్చె, చెక్కిళు లెరుపెక్కె

అన నట్లాతడు, ముఖ్యసేవికకు
లేదానోరు? "నీవంతిక
మ్మున వేంచేయగ రేబవల్
విడక మా భోగమ్ములన్ లోటు క
ల్గనె? నీ రజ్జుల వాలు లెంత
పదనొక్కో! కోయు తుంబీశత
మ్మును నొక్కంట పితామహా!"
యనుచు సంబోధించె స్మేరమ్మునన్ 9.

కాటూరి కవితా పీఠం, కుత్బిగూడ, హైదరాబాద్ - 27.

కిచకిచలు పోయి సొబగుల
పచరింపుచు నున్న రూపవతుల సరసముల్
రుచియాయె ముదుసలికి, చిం
త చచ్చియును విడదు పులు పనగ నిదియెకదా? 10.

"తాత యటంచు నీ పగిది
తాళదళమ్ములు కట్టెదేల భూ
జాతము చేవ బట్టునను
సత్య మెరుంగవు వార్ధకమ్మునన్
నాతి!", యనంగ నాత డెలనాగ,
"భళా!" యని నోరు విచ్చి నీ
ఖ్యాతి నెరుంగ కిందనుక
నజ్జుల మైతిమి కంచుకీ!" యనెన్ 11.

అట్టి యుల్లసమున ప్రతీహారి వైళ
మట బ్రవేశించె, స్థాపత్యు నాజ్ఞ వడసి
వచ్చి చెవినెదో యూది, సత్వరము క్రమ్మ
రిల్లె, నింతు లడలి యేమి టేమి టనగ 12.

"నాకయి యొక్క యప్సరస
నాకము డిగ్గి పురీకవాటపున్
వాకిట వేచియున్నదని వార్త"
యనన్ వచియించి, యేగకే
యాకడ నున్న సొవిదు
నొయారము నన్ కను ముఖ్యదాసి క
ర్ణాకృతి జొన్పె గోప్య మత
డన్య నియోజిత లబ్రమంథరగన్ 13.

మెట్ల దిశ ముఖ్యసేవిక మిగులు నిర్వ్య
రట్లె వెనుదిర్గి చన, తత్పదాంగుళులను
జుట్టికొనియున్న యందియలిట్టు లిట్టు
లన్నయట్టులు రవళించి తెన్ను జూపె 14.

చను మదనా జిహ్వాగముల
వెనుచక్కిన్ నిలిచి చూడ విశదమ్ముగ నో
చిన భాగ్యశాలి కంచుకి
కనులు వెంబడించె వారి కమనీయతలన్

చుట్టి శయనించు నల్ల త్రాచులను బోలు
కేశ బంధములన్ వ్రేలు పాశములను
తెలిమెడల జారు నిరు బుజమ్ముల నిగార
మరసె, చనుకట్ల కుచ్చుల యాట నరసె

అల్లనల్లన నల్లలనాడు కౌను
లందములు చింద, శ్రోణుల్ ప్రియమున నొరసి
కొనుచు బలిమిమై కొనిపోవు తనువు నెడల
నలిగి స్రస్తము లగు నట్టు లరసె నతడు

సోపానముల నెక్కు సొన్నపు బొమ్మ, యూ
రువులచో, నెడచేత తివియ పయికి
తాల్చిన క్రింది వస్త్రమ్మొగ యంగ జం
ఘలు కదళీ కాండములుగ తోప
పారాజి కాళ్ల ప్రభల పాలరా మెట్లు
పర్యాయముగ నెర్రవారు చుండ
మెడలోని కంటెపై, నడుముపై నొడ్డాణ
మున, కరకంకణములను, కాళ్ల

కడియముల చిరుమువ్వలొక్కటిగ మ్రోయు
శింజితమ్ములు తనరాక చెప్ప మున్నె
యామె కైకేయి యభ్యంతరాలయమ్ము
చక్కి పావంచ లెక్కె పుష్పలత వొలె

ఆ ప్రభాత ప్రథమ ఘటికా రవములు
మొరసె సమయ పాలక కరముల ఘణిల్లు

మనుచు, మాగధ జయగీతు లనుసరించె
నంతిపురి వీణియలు గాన మాలపించె 19.

ఆదిశేషుడు మేల్కొంచి నట్లు రాజ
సౌధమున మెలమెల్ల సంచలన మొదవె
చేటికలు దారిజూప నా మేటి దాసి
రాణికైకమ్మ శుభ మందిరమ్ము దరిసె 20.

కదలి రెండడుగులు వైచి, యెదురు పోయి
ద్వారదాసి యామెకు, దేవి ధ్యానమందు
నున్న యట్టులు వచియింపుచున్నతరిని
లోన కంకణ కరముల ధ్వాన మెసగె 21.

ముఖ్యదాసి లోనికి జని, ముని విధాన
శయ్య బద్మాసనమున నిశ్చలత నున్న
దేవి పదములు ముట్టి వందిత నొనర్చి
చెప్పబోవ వారించి వచించె కైక 22.

నీ వచనీయ మమ్మని మనీషి
సమాగమ వార్త యొనెడన్
శ్రావణమాయె మాకు మునె
రామయ తండ్రి ప్రలాపమైనచో
నే వినియుంటి, నింక నెది
యేనియు నన్యము గల్గ చెప్పవే
నీవన, దాసి కన్నుగవ
నీరము నిండి హ్రుదమ్ము లౌటయున్ 23.

మారుతాహతి గూలిన మల్లెతీవ
యనగ, నా దీన, దేవీచరణము లందు
తూలి రోదింప, కరుణము తొలకు కరము
లాపె తలనుంచి, నృపసతి యనియె నిట్లు 24

దోష మాచిరించి దుఃఖించు భీరువు
దోష మధిగమించు దోషవిదుడు
కనుల నీరు తుడుచు కైవడి దోసమ్ము
మనము నుండి తుడువ జను కుమారి! 25.

ఉల్లసమ్ములు నరజన్మ కుత్సవములు
నవనవ మ్మొనరుచు జీవనమ్ము నవ్వి
యైన నవి స్వధర్మమ్మున కడ్డు తగుల
జనదు, తగిలెనా యది యాత్మహనన మగును 26.

చాలు, పొమ్మింక దశరథ చక్రవర్తి
కలుగు నెడకు మద్దుల కొడుకులను పిలుము
పూజ్యురా లక్క గారిని, పుణ్యశీల
చెల్లెలిని బిల్వ్వ మ్మటకె వచ్చెదము మేము 27.

⁂ ⁂ ⁂



# రాళ్ళపల్లి

- శంకరగంటి రంగాచార్యులు

1. జయము రాళ్లపల్లి శర్మకు, సంగీత
సాహితీ ప్రపూర్ణ సారమతికి,
సద్విమర్శకునకు, సౌజన్యమూర్తికి,
మరపురాని గొప్ప మానవునికి

2. వేమనను గురించి విపుల చర్చ యొనర్చి
అతని కవితలోని అందచంద
ములను, మహితశక్తి, తెలుగువానికి చాటి
చెప్పినట్టి శర్మ గొప్ప తెలుతు

3. మూడు వచనకృతులు ముచ్చటగ రచించి
ఆంధ్రరసికలోక మందు సద్వి
మర్శకుండటన్న మహిత శాశ్వత కీర్తి
నందినట్టి శర్మ కంజలింతు

4. పద్యగద్యములను హృద్యముగా, ఆన
పద్యముగ రచించి, పారగుడయి
ఉభయ శిల్పములను, ఉత్తమ సాహిత్య
వేత్తయయిన శర్మ కిత్తు నతులు

5. ప్రాకృతమ్ములోని పసిడి గాథలె కాక,
పాండ్యునార్వల, రస బంధురముగ,
ప్రతి తెనుంగువాడు మతి మెచ్చురీతిగా
అనువదించి నట్టి ఆర్యు తలతు

6. గాన కళను గూర్చి కడుగొప్పగా ఉప
న్యాసములనొసంగి, వ్యాసములను
వ్రాసి, దక్షిణాన వాసి గాంచిన యట్టి
గాన సింధువునకు నా నతులివె

7. సంస్కృతమ్మునందు సత్కావ్యములు వ్రాసి
నాటి మహిషపురపు నరపతి కడ
బహుమతులు గడించి ప్రఖ్యాతి గనిన అ
నంత కృష్ణశర్మ నెంతు భక్తి

8. ఆంధ్రదేశమునను, అట్టులే కన్నడ
దేశమునను కూడ దీటులేని
యశముగాంచినట్టి అసదృశ ప్రతిభా ప్ర
భూత్తమునకు నాదు మోడ్పుకేలు

9. పేరుకొఱకుగాని, విత్తమ్మునకు గాని
ఆశపడక, ప్రతిభ నమ్మి కొనక,
బ్రదికినట్టి పరమ పావన మూర్తిని,
ధన్య జీవినెపుడు తలతు నెడద

రామ్‌నగర్ - అనంతపురం.

కె. యస్వీ. ప్రసాద్, ఉప్పుగుండూరు.

కలసిరాని సహచరునితో కలల సాహచర్యం చేస్తూ
ఎన్నాళ్ళీ అసహజమైన ఆత్మతృప్తిని నటిస్తావ్
కాలం చెల్లిన సూక్తులు వల్లెవేస్తూ
దుర్భరశోక తమస్సును ఆనందజ్యోత్స్నలని భ్రమిస్తావ్
పుట్టినింట, మెట్టినింట, వ్యక్తిత్వపు విలువలేదు
ఆలోచన వచ్చినట్టి అందమైన బొమ్మవునీవు
అసంతృప్తి శృతిమించిన పట్టుచీర ఒకలంచం
నాలుగుగోడల మధ్యన బ్రతుకే గుడుగుడుగుంచం
ఇంటెడు చాకిరీ, దానికి ఉద్యోగపు శ్రమ తోడు
సతమతమయ్యే ఇంటికి శాంతి ఎప్పుడు చేకూరు
నెల మొత్తం చాకిరికి సంతకమే సౌభాగ్యం
దారిగాచి పుచ్చుకొనే శ్రీవారికే నైవేద్యం
సిటీబస్సు రష్‌లోన స్పర్శానందపు ఘనులు
సందుమలుపు సెంటర్‌లో వాగే యువవానరులు
వెర్రిమొర్రి చూపులతో సాటి గుమస్తాలు
ఇంటివారిలోన వదలని చాదస్తాలు

వెలకుకొన్న "భర్త" కేమో తగని తిరస్కారం
తరుణి శ్రమకు లేదెన్నడు తగినపురస్కారం
సంసారపు సాగరంలో సౌఖ్యమేమొ అరుదు
వివాహమ్ము కాకపోతే "వృద్ధకన్య" బరువు
ఎన్నాళ్ళీ నైరాశ్యం ఎన్నాళ్ళీ నిర్లిప్తత
జరుపు పాతభావాలకు దహన సంస్కారం.
భవితనీది, యువతనీది
కవితనీది వవతనీది
నీ ఉనికే సంచేతనం
నీవులేనిది అచేతనం
కనులు తెరచి, కలలు విడచి
విశ్వవారసత్వంలో సమహక్కును పొందాలి
పురుషాహంకార మలిన పంకంలో
ప్రభవించాలి నారీజన చైతన్య కమలం
బహుకాలపు సుప్త సదనం నుండి
రెక్క తొడగాలి ఆవేశపు అరుణ భ్రమరం.

# రెండు కవితలు

యెనిశెట్టి శ్రీరంగనాయక్

## నీరాజనం

మౌనం తప్ప మాటలు మరచిన నాకు
చక్కని చతురోక్తులు నేర్పి
మంత్రాలు నామాటలంటూ
పంజరంలో చిలుకజీవితానికి
స్వస్తి చెప్పించి
తిరిగి పచ్చదనాన్ని పంచి,
పంచవన్నెల రామచిలుక లా మార్చి
వినీలాకాశంలో విహరింపజేశావు
ఆ మధురాను భూతిని నాగుండెగదిలో
పదిలంగా బంధించుకున్నాను
లోకం నవ్వుల్ని, బ్రతుకు ముంగిట్లో
పువ్వులుగా మార్చిన నీకు
నన్ను నేనే నీరాజన మివ్వడంతప్ప
ఇంకేమిచ్చు కోగలను?

'కీ' ఇవ్వకుండానే
తూర్పును మేలుకొలిపే
'అలారం' కోడిపుంజు!
వసంతం పొడచూపగానే
రాగంతీసే 'రేడియో' కోయిలః
ఆకాశం జీతం భత్యెం ఇవ్వకుండానే
కాపలా కాసే 'గుర్ఖా' చంద్రుడు!!

# దాని పేరు నిస్వార్థం!

- జి. శివకుమార్

నాకూ - నా మస్తిష్కపు టిల్లాలికీ
ఇరవై వసంతాల సంసారంలో!
లేకలేక పుత్రిక ఉదయం జరిగింది
దాని నామధేయం 'నిస్వార్థం'
పుట్టక, పుట్టక పుట్టింది. పురిటిలోనే పోయుంటే బాగు అనిపించింది.
నవనవలాడే వయసొచ్చి గుండెలపై కుంపటై కనిపించింది.
నిండైన పరువంతో
మెండైన కులుకులతో
దాయాదుల కళ్ళే చెదిరించేలా ఉంది
దాని నామధేయం 'నిస్వార్థం'!
ఎన్నాళ్ళు చెప్పుకోగలనండీ ఇంట్లో ఎదిగిన కూతురుందని,
ఒంట్లో సత్తువంతా నియోగిస్తున్నా
ఏదైనా జోడందిస్తామని,
కట్నంగా ఇస్తా కన్నీటి ముత్యాలను
కానుక చేస్తా సొంత సంతసాలను,
వరులారా రండి వారువాల నెక్కించి ఊరేగిస్తా,
వధువు వలపు మేదిని నెక్కించి ఊరేగింప చేస్తా,
కనికరించండి కన్యా పితను
భరించ లేకున్నా నీ కుంపటి 'భగభగను'
బ్రతకాలనుంది మీ కులంలోని 'మీనంగా'
దీని పేరు మాత్రం స్వార్థం సుండీ!
ఇది నా తనయ కాదు - తమదేనండీ!

## మందార మాల

# తిరుమల రామచంద్ర 'సాహితీ సుగతుని స్వగతం'

తిరుమల రామచంద్రగారు బహుభాషా వేత్తగా, ప్రముఖ పాత్రికేయునిగా సుప్రసిద్ధులు. వీరు మానవల్లి రామకృష్ణకవి. వేటూరి ప్రభాకర్ శాస్త్రి గార్ల వద్ద ఆంధ్ర, ప్రాకృత భాషా పరిశోధకులుగా శిష్యరికంచేసిన దిట్ట. వీరు మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీలోనూ, తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలోనూ కొన్నాళ్ళు పండితులుగా పనిచేశారు. అనంతరం పాత్రికేయునిగా స్థిరపడి 'నుడి - నానుడి', 'సాహితీ సుగతుని స్వగతం' వంటి భాషా, సాహిత్యమునకు సంబంధిన ప్రత్యేక శీర్షికల్ని పత్రికల్లో నిర్వహించి పాఠకుల అభిమానాన్ని చూరగొన్నారు. వీరు 'భారతి' సాహిత్య మాసపత్రికలో వ్రాసిన 'సాహితీ సుగతుని స్వగతం'లో సాహిత్యానికి సంబంధించి వ్యక్తం చేసిన పలు అంశాలు ఆలోచింపదగినవి.

'సాహితీ సుగతుని స్వగతం' ప్రత్యేక శీర్షికలో 'నవకవుల పాశ్చాత్యుల భావ చిత్రణ' గూర్చి వ్రాస్తూ భావచిత్రణమనేది స్థూలంగా ఐదు విధాలుగా ఉంటుందని వీరు వ్యక్తం చేశారు.

ఒకటి : చెప్పానంటే చెప్పానన్నట్టుగా ఉండవచ్చు. (Conceit). దీనిలో సొగసుగాని, చెప్పిన అభిప్రాయం మరింతగా వ్యక్తీకరించే శక్తిగాని,వర్ణ్యవస్తుతాత్త్వక వివేచనకు, యాథార్థ్య గ్రహణానికి తోడ్పడడంగాని వుండవు. ఇలాంటి భావ చిత్రణం అధమం. మన గుణీభూత వ్యంగ్యంలాగా -

రెండు : అలంకార ప్రాయంగా ఉండవచ్చు. (Ornamental). అంటే కావ్యగతమైన అర్థంతో సంబందించక ఏకదేశంగా వుండడం:

మూడు : కవి చెప్పిన అభిప్రాయాన్ని వ్యాఖ్యానించినట్టుగా వెలుగు చిమ్మి దాని వ్యక్తీకరణకు తోడ్పడడం (Functional)

నాలుగు: కావ్యం సృష్టిలోని ప్రవృత్తి రూపమైన యాథార్థ్యాన్ని తెలియజెప్పుతుంది. కనుక అలాంటి దానిని పాదివిపట్టి ఉంచడం.

అయిదు:- సకల సృష్టిలోను సంవిధాన సద్ధతి ఒకటి వుంది. దానికి సమగ్రత, అఖండత ఉన్నట్లే కావ్యంలో కూడా సమగ్రతను, అఖండతను సాధించి, విశ్వసృష్టితో సంవదింప జెయ్యడం'' అని అయిదు రకాల భావచిత్రణలను తెలిపారు.

తెలుగులో కృష్ణశాస్త్రి, వేదుల, శ్రీశ్రీ, నండూరి, విశ్వనాథ, పిలకా గణపతిశాస్త్రి, సాళ్వకృష్ణమూర్తి, రాంభట్ల కృష్ణమూర్తి, కాళోజి, దాశరధి గారల కవిత్వంలోని భావచిత్రణను ఈ సందర్భంగా ఎత్తి చూపారు.

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు "వరదగోదావరి" గేయంలో కొండలూ, కోనలూ ఏకం చేస్తున్న గోదావరిని ప్రాకృతిక శక్తిగా వర్ణించాడని తెలిపారు. నదిని స్త్రీగాను, ప్రళయ బీభత్సభావాన్ని కరాళశక్తిగాను, నిర్దేశంచడం మన సంప్రదాయమేకాని, ఇక్కడ కవి తన వశంతప్పి పెల్లుబికిన నదిని స్త్రీగా, అకల్పరచనాయత్తగా చిత్రించి కావ్యజగుత్తులో తన వశవర్తిని చేసుకున్నాడని పేర్కొన్నారు.

వేదులవారి "దీపావళినాడు" ఖండికలో దినములు పరస్పరం ప్రతిధ్వనించమనే కవిసమయం, భావ చిత్రణం మన సంప్రదాయంకాదని, పాశ్చాత్యుల ఇమేజరీయేనని వ్యక్తం చేశారు.

మహాకవి శ్రీశ్రీగారి "సుప్తాస్థికలు"గేయంలో సుప్త నిశ్శబ్ద సంపుటములు, ఘనీభవించిన సమాధులు అవి చలించును" మొదలైన చిత్రసామగ్రి అంతా పాశ్చాత్య మత సంప్రదాయంనుండి తెచ్చుకున్న వేనని తెలిపారు. వీరి 'ఒకరాత్రి' గేయంలో భయ సమ్మిళితమైన నైరాశ్య భావచిత్రణ మున్నదని, "ఇసుక తుఫాను, గాలిలో కనరాని గడుసు దయ్యాలు ఈదడం, ఆకాశపు టెడారి, కాళ్ళు తెగిన ఒంటరి ఒంటె" తదితర ప్రయోగాలు పాశ్చాత్య భావచిత్రణలేనని తిరుమల రామచంద్రగారు నిరూపించారు.

నండూరివారి "కలత నిదుర" గేయంలోని 'ఆకాశమో తీరు, ఆవులించిన రేయి" అనే పంక్తుల్లో 'గోరారజేసిన ఆంగ్లేయుల ఆవులింత" ఉన్నదని చమత్కరించారు.

మహాకవి విశ్వనాథ సత్యనారాయణ గారి 'కోకిలమ్మపాట' లో తరగలను ఉరగఫణాలుగా వర్ణించడం మనకు కొత్త కాదని, కాని ఈ గేయంలో లేచిన తరగల తలలను "పాముపడుచులు"గా తరగల మొదళ్ళలోని ఒంపును 'తిప్ప'గా వర్ణించడం ఖచ్చితంగా పాశ్చాత్యుల భావచిత్రణమేనని పేర్కొన్నారు. ఇలా ఆధునిక కవుల కవిత్వంలోని పాశ్చాత్యుల భావచిత్రణలను తిరుమల రామచంద్రగారు సమగ్రంగా ఎత్తి చూపారు. 'సాహితీ సుగతుని స్వగతం' లో తిరుమల రామచంద్రగారు "నేటి సాహిత్య విమర్శ" గూర్చి వ్రాస్తూ కొన్ని కఠోరమైన వాస్తవాలను వెల్లడించారు. "కుక్క మూతిపిందెలు సాహిత్యరంగంలోను పుట్టుకు వచ్చినప్పుడు, దానిలోని ముఠామనస్సు ఇక్కడా ముందుకు వచ్చినపుడు, సద్విమర్శ వికాసం ఎలా సాధ్యం? అని సమకాలిక విమర్శ వైఖరిని సూటిగా ప్రశ్నించారు. సద్విమర్శ రావడానికి కావ్యం చిన్నదైనా, పెద్దదైనా, దానికొక విశిష్టత ఉండాలని, ప్రతీకస్థాయి ఏర్పడాలని అన్నారు. ఇప్పుడు వస్తున్న రచనల్లో చాలా వాటిలో సాంఘిక దృష్టితో పరిశీలించినా, తాత్విక దృష్టితో చూచినా పరిణతి చాలదని, కనుక అవి పండితుల విమర్శకుల దృష్టికి ఆగడం లేదని, ఆగేవి కొన్ని ఉన్నా వాటి రచయితలు విమర్శనను సహించరని వ్యక్తం చేశారు.

తిరుమల రామచంద్రగారు నాయని 'ప్రణయ సూక్తం' గూర్చి వ్రాస్తూ "నాయని వారి సౌభద్రుని ప్రణయయాత్ర ప్రణయసూక్త మనవచ్చునని పేర్కొన్నారు." దీనికి సౌభద్రుని, వత్సల ఆలంబనం మాత్రమే. ఆ పేర కవి తన సంగతే చెప్పినా, ఇది కేవలం ఆత్మాశ్రయ కవితే అయినా, సార్వజనీనతను సంతరించుకున్నది. ఈ కావ్యానికి 'ఫలశ్రుతి' ఉండడం విశిష్టత. ఆధునిక భావకవులందరూ విప్రలంభ శృంగారాన్ని అభివర్ణించిన వారేనని వ్యక్తం చేశారు.

ఈ కావ్యంలోని పద్యాల్లో ఉన్న భావోద్వేగ నిర్ఘరిణి, భావనా తీవ్రత ఈ ప్రణయ యాత్రను 'ప్రణయ సూక్త'మని నిర్వచించడానికి ఆలంబన మవుతున్నదని పేర్కొన్నారు. 'సూక్త'మని వైదిక పరిభాషను వ్యవహరించడంలో తాత్పర్యం కాముక ప్రణయానికి ప్రాధాన్య మనడానికేనని, దీనికి వీరి రచనలోని 'ప్రణయాదర్శనం, స్వప్నప్రణయం, చింత, గాలిపటం, సాక్షాత్కారం, అవధి" తదితర ఖండికలే తార్కాణమని తెలిపారు.

ఈ విధంగా 'సామీతీ సుగతుని స్వగతంలో తిరుమల రామచంద్రగారు సాహిత్యంలోని పలు అంశాలపై తన అభిప్రాయాలను పాఠక జన రంజకంగా వెల్లడించారు. పత్రికల్లో వచ్చిన సాహిత్య సంబంధి ప్రత్యేకశీర్షికల్లో, 'సాహితీ సుగతుని స్వగతం' స్థానం విశిష్టమైనది.

*సిహెచ్. దయానంద్,* *M.A.,M/PHIL*
*H.No. 1-8-462/5 చిక్కడపల్లి*
*వేంకటేశ్వర దేవాలయంవీధి,*
*హైదరాబాద్ - 500 020*

# గౌరవ-నవనాథ చరిత్ర

"భ్రమరా ప్రసాద సంప్రాప్త కవిత్వ
సుమహిత సామ్రాజ్య సుఖపరాయణుడు
చతుర సాహిత్యలక్షణ చక్రవర్తి
ప్రతివాది మదగజ పంచాననుండు
మతిమంతు దయ్యల మంత్రి పుంగవుని
సుతుడు గౌరనమంత్రి సుకవి శేఖరుడు "

-అని తనను గురించి చెప్పుకొన్న గౌరన ఉపజ్ఞ ప్రతిభ కలిగిన ఆనాటి అగ్రగణ్యులైన తెలుగుకవులలో ఒకడు. కవిగా లక్షణ గ్రంధకర్తగా నాటక కథారచయితగా ప్రాచీనాంధ్ర సాహిత్యంలో గౌరనస్థానం విశిష్టమైంది. తెలుగు కవిత్వంలో క్రొత్త ఊపుతో రసజ్ఞులను ఉయ్యలలూచిన శ్రీనాధకవికి ఇతడు సమకాలికుడు. తిక్కనవలె చిక్కని తెలుగు పలుకుబడిని ప్రదర్శించడంలో గొప్పనేర్పరి.

పాల్కురికి సోమన, గోన బుద్ధరాజుల తర్వాత మరల ద్విపదకావ్య ప్రక్రియకు ఒక సమున్నతమైన గౌరవస్థానం కల్పించిన ఘనత గౌరనకు దక్కుతుంది. శివకవులు, ఒక ఉద్యమంగా భావిస్తే, దానినొక కావ్యప్రక్రియగా స్వీకరించి అందులో కావ్యరాశులను పండించిన సుకృతం గౌరనకు లభిస్తుంది.

నిజానికి ఇతడు ద్విపదకావ్య ప్రక్రియకు మార్గాన్ని ఏర్పరచినవారిలో ప్రథముడు కాకపోయినప్పటికినీ, ప్రముఖుడుగా రాణించాడు. శైవతత్వాన్ని ఆరాధించి శివకథలను కావ్యేతివృత్తాలుగా స్వీకరించి తెలుగు నుడికారంతో ద్విపద కావ్య ప్రక్రియకు ఒక ప్రత్యేకతను సంతరించిపెట్టడంలో కృతకృత్యుడయ్యాడు. భక్తి తాత్పర్యాలతో శైవకళను భజించడంలో శ్రీనాధునితో పోల్చదగినవాడు.

గౌరన రచించిన రెండు కావ్యాలు హరిశ్చంద్రోపాఖ్యానం. నవనాథ చరిత్రలు. హరిశ్చంద్రోపాఖ్యానానికి వచ్చినంతటి ప్రాశస్త్యం నవనాథ చరిత్రకు లభింపక పోయినప్పటికినీ, ద్విపదకావ్య ప్రక్రియకు ఒక స్థాయిని చేకూర్చిన కావ్యంగా సాహిత్యలోకంలో నిలిచి గౌరనకు ప్రత్యేకతను తెచ్చిపెట్టింది. అది శ్రీగిరి అను పద్య కావ్యమాధారంగా రచింపబడ్డ 'నవనాథ చరిత్ర'కు ముక్తిశాంత భిక్షావృత్తముని ఉత్సాహప్రోత్సాహాలు లభించాయి. ఇతడు శ్రీశైల మల్లికార్జునాలయ నిర్వహణాధికారి. ఆనాటి శైవమతంతో పాటు, జైనమతాన్ని కూడా ప్రోత్సాహించినవాడు. జన్మతః జైనుడు కాకపోయినప్పటికినీ, తను ప్రోత్సహించిన ముక్తిశాంత భిక్షావృత్తమునిని గురించి కావ్యప్రథమాశ్వాసంలో ప్రశంసా పూర్వకంగా గౌరనకవి -

" నిర్వాహక ప్రౌఢ నీతి కోవిదుడు
కుహనాంబరథ జైన కోలాహలుడు
. . . . . . . . . . . . . . . . . . . . . . .
దుర్వారజైన సింధుర మృగేంద్రునకు
సర్వజ్ఞునకు ముక్తిశాంత రాయనికి "

- అన్న మాటలను బట్టి, గౌరన 'నవనాథచరిత్ర'కు మూలకారకుడైన ముక్తిశాంత భిక్షావృత్తముని జైనమతాభిమానిగా తోస్తుంది. అహింసా సిద్ధాంతాన్ని ప్రతిపాదించే జైన తత్వాన్ని శివవిష్ణు అబేదంతో

సమన్వయించి గౌరన కవి నవనాథ చరిత్రను రచించాడు.

'నవనాథచరిత్ర' గౌరవశైవ సంప్రదాయాభిజ్ఞతకు, ఆధ్యాత్మిక విషయ పరిజ్ఞానానికి ప్రతీక. ఇందులో తొమ్మండుగురు సిద్ధపురుషుల గాథలు వర్ణింపబడ్డాయి. మేఘనాథ, విరూపాక్ష, నాగార్జున సిద్ధుల కథలు పూర్వాపౌర్యాలతో వివరించి ఆతర్వాత బుద్ధినాథుని కథ ప్రాసంగికంగా చెప్పి కావ్యాన్ని పూర్తిచేయడం జరిగింది. వీరికథలనే ఆధారంగా జేసుకొని సరసకావ్య రచనా దృష్టితో గౌరన కావ్యాన్ని రచించాడు. ఆత్రేయసిద్ధ నాగార్జునుడు, వ్యాలి, గోరక్కు, గోరుంటకుడు కథలు 'నవనాథచరిత్ర' లో పొందుపరచబడ్డాయి. కావ్యంలో ప్రసక్తమైన ఈ నవనాథుని కథ ప్రధానమైనది. ఇతడు సారంగధరునకు తన యోగశక్తివల్ల కాళ్ళిచ్చి 'చౌరంగి' అనే పేరుతో అగ్రశిష్యునిగా స్వీకరించాడు. ఈ కథ చివరకు 'సారంగధర' నాటకంగా సాక్షత్కరించింది.

వర్ణనాపరంగా గౌరన తన కావ్యంలో క్రొత్త పుంతలు త్రొక్కాడు. రసజ్ఞులకు ఆనందం కలిగించే వర్ణనలు చేయడంలో అతడు దిట్ట. ప్రథమాశ్వాసంలో పార్వతికి శివుడు యోగముపదేశించు ఘట్టంలో వర్ణింపబడ్డ వసంతవర్ణనం కవిబుతురాజు పట్ల గల నిదర్శనం.

"పాయకఫలములై పదియాఱువెన్న
బంగారు ఛాయ రాబండిన పండ్లు
పొంగారుకొమ్మల పొలుపున వీఁగు
వనమహీరుహములు వరుస చెంపెసగె
మనమున నెచరించి మగకోకిలములు
ముక్కలురెక్కలు మురువుగా దీర్చి
చొక్కింపు లేమావి సురకొమ్మలెక్కి
సెలసి లేఁగొనలెత్తి నెలవులుఁద్రుంచి
కలగొననలుకలు కలుక గానప్పళించి

- అన్న వాక్యాలను పరిశీలిస్తే గౌరన కవిలో నెలకొనియున్న వర్ణనా సామర్థ్యాన్ని గ్రహించవచ్చు. బుతువులలో అగ్రగణ్యమైంది వసంతం. అకుపచ్చని కోరికలతో మనుషులను ఆహ్లాదపరిచే వసంతమంటే ఎవరికిష్టముండదు చెప్పండి! ఇక విశ్వానికి విశ్వకల్యాణానికి కారణభూతులైన శివపార్వతుల్ని జలక్రీడలాడే సందర్భంలో కవి వసంత బుతువు ద్వారా కావ్యంలో వ్యక్తీకరించాడు. లోకకల్యాణానికి సంధానకరులైన శివపార్వతులు రసస్వరూపులు కదా!

శివపార్వతులకు అస్వాద యోగ్యమైంది శైవ పారమ్యానికి ప్రీతి పూర్వకమైంది శృంగారమైనా, ప్రస్తుత కవి తన కావ్యంలో హాస్యరసాన్నికూడా సమపాళ్ళల్లో పరిపోషించి కావ్యానికి ఒక వింత సొబగును చేకూర్చాడు. తృతీయా శ్వాసంలో వంచకుడైన పురోహితుని వర్ణిస్తూ -

"పొందును బ్రతుకుచు భూరి సౌఖ్యముల
పురోహితుండితడు కురూపి
మిసమిసమనెడి తుమ్మెదలమై కప్పు
నెఱపెడి కురులు గ్రొన్నెల వింతచెన్ను
మఱపించు నుదురును మలయు బేడిసల
మఱగించు కన్నుల మణిదర్పణముల
తెఱగఁగు చెక్కులుఁ దిలకుసుమంబు
మిగులు నాసికయును మేలియమొల్ల
మొగడల నగుదంతములు బింబఫలము
దలపించు నధరంబు దర్పకుశంఖ
కలిత సౌభాగ్యంబు ( గడచిన గళము
బిసములనటమటించెడు బాహులతలు

. . .. . . . .. . . . ... .. .. ...............

- అన్నమాటలు కవి హాస్యప్రీతికి నిదర్శనాలు. వంచకుడైన పురోహితుని రూపరేఖలను గురించి వివరించడమే కాకుండా తాను హీనకులంలో పుట్టి

నందులకు బాధపడుతూ, ఉన్నతరాజ వంశంలో పుట్టి అప్సరసనుప్రేమించి వివాహంచేసుకొనే భాగ్యాన్ని కోల్పోయిన ఒక కురూపి అంతరంగాన్ని విశ్లేషించడంలో గౌరన పుష్కలంగా హాస్యరసాన్ని అందించి కావ్యంలో హస్యరస ఔన్నత్యాన్ని ద్విగుణీకృతం గావించాడు. కావ్యాన్ని చదివిన పాఠకులు ఈ ఘట్టందగ్గర కడుపార నవ్వుకొంటారనడంలో అతిశయోక్తిలేదు.

'నవనాథచరిత్రలోని పాత్రలన్నీ ఒక ఎత్తు. సారంగధురుని పాత్ర వొకటీ ఒక ఎత్తు. అతడు విశిష్టమైన వ్యక్తిత్వం కలవాడు. రాజకుమారుడైనప్పటికినీ, యౌవనదశలో అడుగుపెట్టాక పలుకామ వికారాలకు, భ్రమ ప్రమాదాలకు లోనుగావలసిటువంటి పరిస్థితులు ఏర్పడినప్పుడు కూడా నిగ్రహంతో వాటిని అవలీలగా ఎదుర్కొని తనవ్యక్తిత్వాన్ని కాపాడుకొంటాడు. తన పొందు గోరిన చిత్రాంగితో సారంగధరుడు

॥ పినతల్లినని నిన్ను చెద్దయు నమ్మి
చనుదెంచ నిట్టిమోసము చాలగలిగె
దలపోయ విన(జెప్ప ( దగునె యీపలుకు
నిలువక వాక్రువ్వ నెట్లాడె నోరు
ఎలనాగ యేదిరి యెత్తెఱుగక వట్టి
వలవంత ( చొరలేదు వావి పూవిడిచి
తల్లియే దైవంబు తలపోయుననుచు
నుల్ల మారంగ ( జెప్పుచుందురు బుధులు
కలలోన బరకాంత ( గదియుట నాకు
చెలియలి గామించి చేపట్టుకొనుట
కులశీలములు మదిగోరి రత్నాంగి
కలవడ జన్మించినట్టి నాకేల
మదికింపుగాని దుర్మార్గవర్తనము
వదలు మీతల్పుధరావల్లభునాన
పదివేలు నేల భావసంశుద్ధి
మదనాంతకుడు దక్క మునుజులెర్గుదురె !"

- అంటాడు. రాజవంశాలలో స్వేచ్ఛా కాముకత్వం స్త్రీపురుషుల్లో ఉండే సహజలక్షణం. కాని వారిలోకూడా శీలసంపదకు ప్రాముఖ్యమిచ్చే యువరాజులుంటారన డానికి ప్రబలోదాహరణం. సారంగధురుడు కామించింది అందులోనూ తన పినతల్లి చిత్రాంగి. మాళవ దేశ పురాజైన రాజమహేంద్రుని భోగకాంత. సహజంగా వెలయాలికుండే లక్షణం చిత్రాంగిలో ప్రస్ఫుటమైతే, శీలసంపద నెలకొని యున్న సారంగధరుని వ్యక్తిత్వం దానిని తిరస్కరించింది. తుదకు అవ్యక్తిత్వమే అతని కాళ్ళుపోగొట్టుకొనే పరిస్థితిని తెచ్చిపెట్టింది. అయినప్పటికినీ సారంగధురుని చివరకు మీననాథుని యోగశక్తి వల్ల కాళ్ళనుపొంది 'చౌరంగి' అనే పేరుతో లోకంలో విరాజిల్లాడు. విశిష్టమైన వ్యక్తిత్వమే మనిషికి బలమన్న విషయం సారంగధరుని పాత్రద్వారా నిరూపించబడింది. గౌరన తన కావ్యంలో మిగిలిన పాత్రల కంటే సారంగధరుని చక్కగా తీర్చిదిద్దాడనే విషయం కావ్యం చదివిన వారికి విశదమౌతుంది.

ఉదాత్తమైన సన్నివేశాలను ఎంపికచేసుకోవడం లోను, ఎంపిక చేసుకొన్న సన్ని వేశాలను కమనీయంగా చిత్రీకరించడంలోను గౌరన తన బుద్ధి కుశలతను, కమనీయ కవితా వైభవాన్ని కనబరచాడు. ఎంతో ఉదాత్త సన్నివేశమైతే తప్ప అతడు కావ్యంలో చిత్రీకరించడు. మొదటినుండి చివరివరకు కావ్యాన్ని ఆద్యంతాలు పరిశీలిస్తే మనకీవిషయం. తేటతెల్లమవుతుంది. తనను ప్రస్తుతం కావ్యరచనకు ప్రోత్సహించిన ముక్తిశాంత భిక్షావృత్తమునిని గురించి.

"కర్పూర హిమజలకాశ్మీర మిళిత
దర్ప సారాంబుసిక్త ప్రదేశమును
దవనీయ జాల కాంతర గతధూప
విపుల సౌరభ సమన్విత గంధవాహ
భాసిల్లునిజ సభాభవనంబు నందు
శ్రీ సముజ్జ్వల రత్నసింహాసనమున

నాసీనుడైన యుండె . . . .. . . . .

- అని సందర్భోచితంగా పలికిన మాటలు గౌరన విశిష్ట వ్యక్తిత్వాన్ని తనను కావ్య రచనకు ప్రోత్సహించిన ముక్తి శాంత రాయని పట్ల కవికి గల గౌరవాన్ని విశదీకరిస్తాయి.

గౌరనశైలి ఎక్కడను ఒడిదుడుకులు లేక ఒడుపుతో ఒయ్యారపు హొయలతో పచ్చని పంటచేనుపై గాలికెరటం వలె పరువులువారుతుంది. తిక్కనవలె చిక్కని తెలుగు పలుకుబడి ప్రాముఖ్యాన్ని ప్రదర్శించడంలో బహునేర్పరి గౌరన. ఆయనవలె గౌరన అలతి అలతి తుని యల కాహళ సంధించిన విధంగా అశిథిలబంధం అపేలవమైన శైలీ లాలిత్యాన్ని ప్రసాదిస్తాడు. ఎక్కడొగాని సమాస రచన చేయడు. రసోచితమైన రచనా విన్యాసం,పదబంధంబు అనేది సామాన్యకవులకు సాధ్యపడేది కాదుగాదా! అందులోనూ తిక్కన మార్గం అనురించాలంటే మాటలా! అదిగౌరన వంటివారికే సాధ్యమౌతుంది.

'నవనాథ చరిత్ర' భాషాపరంగా పరిణితిని సాధించిన కావ్యం. ప్రాచీన తెలుగు సాహిత్యంలో పద్యకావ్యానికి ఆదరణ పెరుగుతున్న రోజుల్లో, గౌరన ద్విపదకు పట్టంకట్టి జనసామాన్యంలోకి చొచ్చుకొని పోయే కథలనుస్వీకరించి వానికి భాషా పరమైన తొడుగుతో కావ్యావృత్తిని కల్పించి తను అనుకున్న రీతిలో కావ్యరచన చేయలిగాడు గౌరన కవిత్వానికి ప్రాణభూతమైంది కావ్యంలో తొణికిసలాడే అపారమైన తెగుదనం. మీననాథుడు మాళవదేశాన్ని దర్శించినప్పుడు మాళవదేశాన్ని గౌరన ఒక అచ్చపు తెలుగు పట్టణంగా అభివర్ణించాడు.

'నవనాథచరిత్ర' లో ప్రస్ఫుటమయ్యే నాథ సంప్రదాయం లౌకికధర్మవిరుద్ధమైంది. అంతేకాక అది విశుద్ధయోగాచారాంశంగా తోస్తుంది. వైష్ణవమతంతో పగలేక,రామాయణం, వంటి ఉదాత్త కావ్యాలతో వైరంలేక, తీర్థయాత్రలన్న నిరసన భావంలేక వ్రత నియమాల పట్ల ఏవగింపు లేక సంప్రదాయ విరుద్ధంకాని నాథ సంప్రదాయాన్ని స్వీకరించి జైన మతాన్ని అభిమానించే ముక్తి శాంత భిక్షావృత్తముని ప్రోత్సాహంతో గౌరన 'నవనాథ చరిత్రను' ను రచించాడు. అంతేకాక జైన మతానికి మూలస్తంభమైన అహింసాతత్వాన్ని చతుర్థాశ్వాసములో

"శ్రీవిలసిల్ల నాసిద్ధ యోగీంద్రు
డావల గొంత దవ్వరుగుచు నుండ
నెలుకలు బిల్లులు నెలమియై ( గూడి
పులులును గోవులు ( బొందొంది పోసగ
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .
చెలగ నచ్చరువంది శిష్యులందరును
ముదమార ( గరము మొగిచి యిట్లనిరి"

- అన్నమాటలద్వారా వ్యక్తం చేశాడు. శ్రీనాథుని సమకాలికునిగా, పదునైదవశతాబ్దిలో జీవించిన గౌరన తల్లిదండ్రులు పోచాంబ అయ్యలరాజు దంపతులు.

"ఒప్పదు ద్విపదకావ్యోక్తి నావలదు
అట్టునుగాక కావ్యము ప్రౌఢి పేర్మి
నెట్టున రచియింప నేర్చిన ( జాలు
నుపమింప గద్య పద్యోదాత్త కృతులు
ద్విపదులు సమమనిభావించ "

- అని పాల్కురికి సోమనాథుడన్న మాటలు గౌరన కవిపట్ల అక్షర సత్యాలు.

*- డాక్టర్. ధూర్జటి వేంకటబాలాజి,*
*డోర్. నెం. 10.38.8* **B,** *టీచర్లకాలనీ,*
*జనతాపేటఫస్ట్‌లైన్, కావలి - 524202.*
*నెల్లూరు (జిల్లా) ఆం.ప్ర*

కథ

# పాఠ్య పుస్తకం

- డా॥ మాధవరావు రేగులపాటి

ఆమె విశ్వవిద్యాలయంతో పని చేస్తుందని తెలుసు బహుశా ప్రొఫెసర్ కావచ్చు. ఆమె చాలా బుద్ధిమంతు రాలని, పలుకుబడి గలదని, మర్యాదస్తురాలని విన్నాను. అదే విశ్వవిద్యాలయంలో పనిచేస్తున్న రాజారాం ఆమెను అప్పుడప్పుడు చూస్తున్నాడు. పలకరించి ఎరగడు కాని అతడు ఆ మేడం యొక్క జీవిత చరిత్రను సాకల్యంగా చదివినట్లుంది.

రాజారాం ఒక రోజు ఇంటిలో విచారంగా కూర్చొని ఉన్నాడు. ఎవరు లేరు. ఒంటరిగా ఉన్నాడు. పదకొండు దాటిపోయింది. అతడు భోజనం చేయనట్టుంది. వినీలాకాశంపై అప్పుడప్పుడు మబ్బుతెరలు క్రమ్ము కుంటున్నై. ప్రక్కనే చెట్టుమీద కూర్చున్న గోరువంక ఏదో కూస్తున్నది. అరుస్తున్నది. దాని అరుపులో భాధ వ్యక్త మౌతున్నది. అప్పుడే పోగొట్టుకున్న తన ఆడపక్షికొరకు తిరుగు తున్నట్టున్నది. అందుకే అరుస్తున్నది. గొంతులో మార్ధవంలేదు. ఆ అరుపులలోనుండి ధ్వనులు ఆగిఆగి తరగలు తరగలుగా బయటికొస్తున్నై.

అప్పుడే గేటు చప్పుడైంది. రాజారాం వరండాలో కూర్చున్నాడు. వరండా గేటుకు ఎదురుగా లేదు. ఎదురు వచ్చేది పోయేది ఎవరో కనిపించదు. గేటు చప్పుడు అయితేమాత్రము ఎవరోవస్తున్నారని గ్రహించవచ్చు. ఆగేటు చప్పుడు విన్న రాజారాం ఎవరో వస్తున్నారని అనుకున్నాడు. వచ్చేవాళ్ళురానీలే అనుకున్నాడు. సరాసరి ఆమెలోనికి వచ్చేసింది. ఆమె మేడం శాంత.

మేడం శాంతను చూడగానే రాజారాం కంగారు పడిపోయాడు. తన భార్య చనిపోయిన రోజు రాలేదు శాంత. ఆ తర్వాతా రాలేదు. ఆమె తనకి సారీకూడ చెప్ప లేదు. కాని ఈ రోజు వచ్చింది. కారణం రాజారాంకు తోచ లేదు. ఆమె అంతస్తుకూడ పెద్దదే. అలా ఎందుకు వచ్చిందో అతనికి తెలియలేదు. అయినా వచ్చింది కదాఅని కూర్చోమన్నాడు.

రాజారాం ఆమెతో మాట్లాడడానికి కొద్దిగా సంకోచపడ్డాడు. అతడు అదే విశ్వవిద్యాలయం లెక్చరర్ శాంత అదే విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్. ఆమె హోదా, ఇల్లు, కారు, ఇంటి అలంకరణ, హుందాతనము మొదలగువాటిని వూహించుకొని మరల తనింటియొక్క సాధారణ రూపాన్ని ఐహించుకొని తనకు తానే కుంచించుకుపోయాడు. అయినా తమాయించుకున్నాడు. తనకుతానే సమాధానపడ్డాడు. ఎవరిస్థితి వారిదే అనుకున్నాడు. తనను గురించి ఇతరులు ఏమనుకున్నా చేయగల్గిందేమీ లేదని అనుకున్నాడు ఉన్నదానితోనే సంతృప్తి పడవలెనని అనుకున్నాడు. ఇలా అలోచిస్తూ ఆలోచిస్తూ ఆమెతో మాట్లాడమే మరచిపోయి పరధ్యానంలో పడిపోయాడు. కొద్ది సేపట్లోనే శాంతగారి భర్తకూడ వచ్చాడు. అతడు రాజారాం గారికి పరిచయస్తుడే. వారిద్దరిలో హలో, హలో అన్నంతస్నేహముంది. "నమస్కారమంటే నమస్కారమనుకుంటారు.

ముగ్గురు మూడు కుర్చీల మీద కూర్చున్నారు. వాళ్ళు కూర్చున్న గదినిండ పుస్తకాలున్నవి. ఆ పుస్తకాలన్నీ వరుసలలో అమర్చబడివున్నవి. రెండవగదిలో మూడవగదిలో చిల్లర చిల్లరగా సామానంత పడివుంది. పుస్తకాలమీద ఉన్నంత శ్రద్ధ ఇంటిలోని సామాను మీద లేనట్టున్నది. శ్రద్ధఉన్నా వాటిని సర్దలేక పోయాడేమో! ఒక్కడు ఎన్నని చేయగలడు.

ముగ్గురు కొంత సేపు మౌనంగా కూర్చున్నారు. కాని ఎంతసేపు అలా కూర్చోగలరు? మాట్లాడాలి. ఏమి

మాట్లాడాలి. ఎలా మొదలు పెట్టాలో ఎవరికీ తెలియడం లేదు. ఎవరి జీవితంతో ఎవరికీ పరిచయంలేదు. ఎవరి వ్యక్తిత్వంతో ఎవరికి సన్నిహితత్వంలేదు. వచ్చిన వాళ్ళు వచ్చారు. వట్టిగా కూర్చోలేరు. ఎక్కడో దూరం నుండి వచ్చినవాళ్ళు ఉద్దేశ్యపూర్వకంగా వచ్చి ఉంటారు. ఆ ఉద్దేశ్యము చెప్పడం కూడ కష్టమేం చెప్పకుండా ఉండలేరు.

" కలవాలని వచ్చామండీ" అన్నది శాంతమేడం "మీరు కబురు చేస్తే నేనే వచ్చేవాడిని" అన్నాడు రాజారాం.

రాజారాం ఆతురతతో లేవబోయాడు. ఇంటిలోకి చూచినట్లనిపించింది. దానిని గ్రహించింది శాంత.

"మీరు కూర్చొండి" అని అంది శాంత.

"మేడం . . . . ' అన్నాడు రాజారాం.

"లేదండీ. మర్యాదలు వద్దు" అంటూ వారించాడు గోపాల్.

"మేము ఒక పనిపై వచ్చాము" అన్నది శాంత.

"చెప్పండి" అన్నాడు రాజారాం.

"మీరు ఒంటరిగా ఉంటున్నారుకదా! ఏదో జ్ఞాపకము చేసి మీ మనస్సు బాధించ దలచుకోలేదు. అయినా జ్ఞాపకం చేస్తున్నాం. క్షమించాలి. మనిషి తోటిమనిషికొరకే ఉంటాడు. మనము ఒకరికి మేలు చేయాలి. అదేకదండీ బ్రతుకు ధ్యేయం. పిట్టకు గూడున్నది. చెట్టుకునీడున్నది. పుట్టిన మనిషికి ఏమ్నుది? . . . అని ఏదో వేదాంత దోరణితో అంటూనే ఉంది శాంత.

రాజారాంకు అర్థం కాలేదు. ఆమె అతని ఊరుకు చెందింది కాదు. అతని వాడకు చెందిందికాదు. అతని కులానికి చెందింది కాదు. డిపార్టుమెంటుకు చెందింది కాదు. మరీ వేదాంతం ఎందుకు చెప్పుతున్నది? ఏదో సత్యము చెప్పేముందు ఉపోద్ఘాతములా ఉంది.

ఆమేడం చెప్పబోయే దేమిటో రాజారాం ఊహకు తట్టలేదు. తోచలేదు, పరిపరివిధాల మనసులో అనుకున్నాడు. కాని ఆ చెప్పబోయే విషయం యొక్క తుది మొదలు తెలియలేదు.

"మీరు ఒంటరిగా ఉండలేరుగదండి" అన్నాడు గోపాల్.

"ఉంటున్నానండీ" అన్నాడు రాజారాం.

"ఎన్ని రోజులుండ గలరు?"

"......" రాజారాం జవాబు చెప్పలేదు. మౌనంగా ఉండిపోయాడు.

"మీ అమ్మాయి పెళ్ళిఅవుతుంది. ఆమె వెళ్ళిపోతుంది. ఆమె సంసారము ఆమెది. కొన్ని రోజులకు కొడుకుకు ఉద్యోగము దొరుకుతుంది. అతనికి పెండ్లి అవుతుంది. వెళ్ళిపోతాడు. మీరొక్కరుండవలసి వస్తుంది. ఇక్కడ ఆస్తి ఉంది. మీ ఊళ్ళో ఆస్తి ఉంది. వీటిని కాపాడడమెలా?"

రాజారాం వ్యవహారజ్ఞుడు అవునో కాదో తెలియదుకాని ఎంతో వ్యవహారజ్ఞానమున్నదని తనకుతానే అనుకుంటాడో ఏమో! పని అయితే నేను చేశానంటాడు. కాకుంటే ఎవరిమీదనో నిందవేస్తాడు. ఆయన గుణమది. మేడశాంత గుణం అటువంటిది కాదు. ఆమెది విశిష్టమైన గుణం. నిశ్చితమైన అభిప్రాయాలున్నవి. సమాజ పరిజ్ఞానమున్నది. వ్యవహార దక్షత ఉన్నది. తూచి తూచి మాట్లాడుతుంది.

మేడం శాంత లేచి నిలబడ్డది. గోపాల్ గిలబడ్డాడు. మేము మళ్ళీవస్తాం. ఆలోచించండి అన్నారు. మేడం శాంత గేటు దాటిపోతూ పోతూ ఒకమాట అంది, "ఒక అబలను ఉద్ధరించినట్లు అవుతుంది" అని వెళ్ళిపోయింది.

ఆ మాట గాలిలో గిర్రుగిర్రున తిరుగుతున్నది. చెవిలో దూరి పోయింది. హృదయానికి గాయంలా తగిలిపోయింది. ఎన్నియుగాలనుండో ఎన్నిజగాలనుండో దూసుకొని వస్తున్నమాట అనిపించింది. ఒక్కొక్కమాట ఒక్కొక్కరినోటనుండి వెడలినప్పుడు బలాన్ని పుంజుకొని బయట పడతుంది ఏమో! ఎందుకోకాని మేడం శాంత పలికిన మాట రాజారాం హృదయంలో నిలిచిపోయింది.

రాజారాం ఆరోజంతా అశాంతిగా కాలం గడిపాడు. "ఒక అబలను ఉద్ధరించినట్లవుతుంది" అనే మాట ఆయన హృదయంలో మారుమ్రోగుతుండె ఈ వాక్యా

అనుకూలంగా, ప్రతికూలంగా అనేక వాదోపవాదాలు ఆయన మనసులో విన్పించాయి. అనేక దృశ్యాలు ఆయన కళ్ళలో కదలాడాయి. అనేకం దృశ్యాలు కళ్ళ ముందుకు వచ్చినవి.

ఆ ముదుసలివాడు రాజారాం వయసు వాడే. చాల మంచివాడు. అతనికి ఒక కొడుకు ఇద్దరు కూతుళ్ళు. ఆయనకిప్పుడు డెబ్బది ఏళ్ళు. ఆ ముదుసలివాడు నలుబది సంవత్సరాల వయస్సులో ఉన్నప్పుడు ఆయన భార్య చనిపోయింది. ఆ తరువాత పెండ్లి చేసుకొనలేదు. ఎందరో ఎన్నో చెప్పారు. అయినా ఆయన వినలేదు. కొడుకు పెండ్లి అయిపోయింది. ఆయనకు ముగ్గురు కొడుకులు. కూతుళ్ళ పెండ్లిళ్ళు అయిపోయాయి. వాళ్ళు అత్తవారింటికి వెళ్ళిపోయారు. ఆయనంటే లోకానికి గౌరవమున్నది. ఆపదలో ఎందరినో ఆదుకున్నాడు. నలుబది ఏండ్ల నుండి దగ్గర దగ్గరగా డెబ్బది ఏండ్లవరకు రాత్రి పగలు పనిచేసి సంపాదిస్తుండేవాడు. కానీ డెబ్బదవ ఏడు దాటిన తరువాత ఆయన ఇంకా ఏమి కాయకష్టము చేయగలడు; అందుకే ఆయన కొడుకు ఆయనను ఈసడించుకున్నాడు. కోడలు తిట్టిపోసింది. మనమలు మనసు నొప్పించారు. సంపాదించిన నాడు మ్రొక్కినారు. సంపాదించలేనినాడు చచ్చినోడు అన్నారు. ముదుసలివాడే కాని అభిమానం చావలేదు. ఒకరోజు తెల్లవారేసరికి ఆయన కట్టుకొన్న ఇంటిలోనే ఉరివేసుకున్నాడు. చనిపోయాడు. కొడుకు బోరుమన్నాడు. మనుమలు అయ్యో, అయ్యో అన్నారు. కోడలు మనసు కోతగా ఏడ్చింది. ఇదంతా లోకం కొరకు. కానీ, లోకం మాత్రం ఆయన శవం మీద మల్లెపూలను చల్లింది. కన్నీరు కార్చనివారు లేరు.

రెండవ దృశ్యం ఇతడు కూడా అదే ఊరివాడు. అతనికిప్పుడు డెబ్బది సంవత్సరాల వయస్సు. నలుబది సంవత్సరాలనాడు అతని భార్య చనిపోయింది. ఆయన మరల పెండ్లి చేసుకున్నాడు. అతనికి కుచేల సంతానం కల్గింది. ఆయన కొడుకులు, కూతుళ్ళు ఇదికావాలీ, అది కావాలని బాధిస్తునే ఉంటారు. కానీ ఆయన భార్య ఆయనను ఆదుకున్నది. ఆ సంసారం స్వర్గం కాదు కానీ, నరకం కూడా కాదు. అతడు ఉరివేసకొనే స్థితిలో లేడు.

ఇలా ఒకటి రెండు కాదు. ఎన్నో దృశ్యాలు అతని కళ్ళముందు కదలాడుతూ కదలాడుతూ వెళ్ళాయి. మనిషికి తోడు ఉండాలి. దైహిక సుఖము ప్రధానము కాదు. మానసిక సంతృప్తిని యివ్వగలిగిన సంసారమే వుండాలి. ఆ సంసారంలో మానవుడు సుఖాన్ని అనుభవిస్తాడు.

రాజారాం కళ్ళముందు ఇలాంటి దృశ్యాలు అనేకంగా కనిపించాయి. కొన్ని అతని వాదనను నిలదీశాయి. ఒక నిర్ణయానికి రావడం అతని మనోబలంపై ఆధారపడి ఉంటుంది.

వ్యక్తి ముందు కేవలం ఒక వ్యక్తి మాత్రమే వుండడు. సమాజం కూడ ఉంటుంది. వ్యక్తి నడవడి సమాజానికి ఆదర్శం అయినపుడు సమాజం ఆ వ్యక్తిని పూజిస్తుంది. రాజారాం ముందు ఒక సమస్య నిలిచిపోయింది. ఆచారాన్ని అనుసరించాలా లేదా? మూడవ దృశ్యం అతని కండ్లముందు మరొకటి...........

అతడు ధనవంతుల ఇంట్లో నౌకరీ చేశాడు. ధనవంతులు తమ భార్యలతో సవారి బండ్లలో కూర్చొని ఒక ఊరి నుండి మరో ఊరికి వెళ్ళేవారు. సవారి బండ్లకు సవారి ఎడ్లు ఉండేవి. అతడు ఆ బండ్ల ముందు మైళ్ళకు మైళ్ళు పరుగెత్తి వెళ్ళాలి, నడుముకు పంచె బిగించుకొని ఒగరుకొట్టుకుంటు ఉరికేవాడు. కాళ్లకు చెప్పులుండేవి కావు. అతడు దాన్నే బ్రతుకు అనుకున్నాడు. మంచి బ్రతుకులు బ్రతికేవాళ్ళంతా పూర్వజన్మలో పుణ్యంచేసిన వాళ్ళని నమ్మినాడు. కర్మ అని నమ్మాడు. పూర్వ జన్మలో పాపం చేస్తే, ఈ జన్మలో ఇలా ఉంటుందని భావించాడు. కానీ బానిస బ్రతులకు కారణము సామాజిక దారుణ వ్యవస్థ అని అనికి తెలియదు. భూకామందుల దురహంకార తత్వానికి బలి అయిపోతున్నామని భావించేవాడు కాదు. కొంతకాలానికి అతని జీవితంతో మార్పు వచ్చింది. అతడు ఊరికి తిరిగి వచ్చాడు. తన పొలం తనకు దక్కింది. తన బావికి స్వంతంగా మోట పెట్టుకున్నాడు. తన వద్ద పాలేరున్నాడు. తనకు ఎద్దులున్నవి. గేదె ఉన్నది.

ఆవులున్నవి. ఎడ్ల బండి ఉన్నది. చిన్న సవారి బండి ఉన్నది. ఆయన ఊరిలో ఆసామిగా చలామణి అవుతున్నాడు. ఎంగిలాకులు నాకి బ్రతికిన ఆయన జీవితము మారిపోయింది.

నాల్గవ దృశ్యం అతని కండ్లముందు నిలిచింది. కొడుకులు చిన్న వాళ్ళే. బిడ్డలు చిన్న వాళ్ళే. వాళ్ళను సాకేది ఎవరు? పెంచేది ఎవరు? ఆయనకు వండిపెట్టేది ఎవరు? బయట పొలాల్లో పని చేయడానికి వెళ్తాడు. దాదాపు పదకొండు గంటలకు ఆవురు ఆవురు మంటు తిరిగివస్తాడు. అప్పుడు అతనికి అన్నం పెట్టేదెవరు, ఇంటిలో ఉంటున్న తన పిల్లలకు, గంజినీళ్ళో, గటక కూడో పెట్టేదెవరు? పిట్ట పిల్లలకు ఏరుకొని గింజలు తెస్తుంది. వచ్చేవరకు నోరు తెరుచుకొని కీచుకీచు మనే పిల్లలకు నోటిలో గింజలు పెడుతుంది వాటి తల్లి. ప్రకృతిలో ఎంతటి సువ్యవస్థ ఉంది. తల్లి చనిపోతే పిల్లలను పెంచేదెవరు!

ఆయన రెండవ పెళ్ళివల్ల వచ్చే కష్టాలనుగానీ, నష్టాలను గానీ లెక్క చేయలేదు. అందుకే ఆయన రెండవ పెళ్ళి చేసుకోవడానికి నిశ్చయించుకున్నాడు.

పెండ్లి అయింది. సవతి తల్లి కదా! అంతేకాదు, అతనికి కొందరు పిల్లలు పుట్టారు. మొదటి భార్య పిల్లలు పెద్దవారు కాజొచ్చారు. ఆడపిల్లలు పెళ్ళికి ఎదిగారు. అతనికున్న భూమిని అమ్మి వాళ్ళ పెళ్ళిళ్ళు చేశాడు. పెద్దవాడు ఉద్యోగం చూచుకొని తన భార్యను తీసుకొని తనదారి తాను చూచుకున్నాడు. అయిదు వేళ్లు నోటిలోనికి పోతున్నై. అంతకుమించి అతనికి ఆస్తిలేదు. సర్కారు జీతం అమావాస్యగా మారుతుంది. అలాగే నెలలో మొదటి రోజున పూర్ణిమనాటి చంద్రునిలా వెల్గినా వారి జీవితం పదిహేవనాటికి అమవాస్యగా మారుతుంది. అతని మిగిలిన కొడుకులు హోటల్లో జీతమున్నారు. అందులో ఒకడు బారులో జీతమున్నాడు. గంపెడు సంసారము, ఎదిగిన వాళ్ళు గట్టు కొకడు, గుట్ట కొకడుగా వెళ్ళిపోయాడు. ఇంటిలో మిగిలిన వాళ్ళు - అతడు, అతని భార్య, రెండవ భార్య, పిల్లలు. అతడు అరవయిలో పడి పనిచేయలేని వయస్సు వచ్చింది. అతని భార్య యవ్వనము దాటీ దాటనట్టుంది. పిల్లలు కనడానికి తయారుగానే ఉంది. అప్పటికే సంసారము గుల్లైపోయింది. తినడానికి కష్టంగా ఉంది. గ్రామంలో అంతవరకు ఆయనకున్న పరపతి కాస్తా మటుమాయమైపోయింది. భార్యనడవడి మారింది చూచేవాళ్ళకే జాలివేస్తుంది. కానీ, అతని బాధను ఎవరు భరించగలరు. తన ఒళ్ళు బరువుకు తానే ఏడువాలి. కానీ, పరులెందుకు ఏడుస్తారు. మరి ఎంతవరకు ఏడుస్తారు.

ఇలాంటి దృశ్యాలు ఎన్నెన్నో ఆయన కండ్లముందు కదలాడినవి. తన అభిప్రాయాన్ని మార్చుకుంటాడు. ఒక తడవ అవునను కుంటాడు, మరొకసారి కాదనుకుంటాడు. ఊహాలోకం నుండి తేరుకొని తన జీవితాన్ని తానే పరీక్షించుకుంటాడు. తన భవిష్యత్తును గురించి ఊహించుకుంటాడు.

సంధికాలంలో మనిషిధైర్యంతో నిలబడాలి. ఎవరి నిర్ణయం వారే చేసుకోవాలి. ఆ నిర్ణయం వల్ల కలిగే లాభ నష్టాలకు తానే బాధ్యుడు. బాధ్యత గుర్తించిన వానికి స్వంత నిర్ణయం వల్ల కలిగే సుఖ దు:ఖాలకు అతీతుడుగా ఆయన బ్రతుకుతాడు.

ఆ రోజు రాత్రి గడిచిపోయింది. రాజారాం ఆమె ఇంటికి వెళ్ళాడు. ఆమె పేరు ముత్యాలమ్మ. మేడం శాంత చెప్పింది ఆ ముత్యాలమ్మను గురించే. ముత్యాలమ్మతో రాజారాంకు చాలా రోజులనుండి పరిచయమున్నది. ఆమె ఒంటరిగా జీవితం గడుపుతున్నది. ఒంటరిగా బ్రతుకాలని దృఢ నిర్ణయం చేసుకుంది. ఎందుకో కానీ తన నిర్ణయాన్ని మార్చుకుంది. ఆ కారణం రాజారాంకు తెలియదు. కారణం ఉందని కూడా రాజారాంకు తెలియదు. పెండ్లి చేసుకుంటాననే నిర్ణయానికి వచ్చిందని కూడా అతనికి తెలియదు.

రాజారాం జీవిత చరిత్రను గురించి ముత్యాలమ్మ సంపూర్ణంగా తెలుసుకుంది. కానీ, ముత్యాలమ్మను గురించి ఆయనెప్పుడు ఆలోచించలేదు. ఆమెను గురించి తెలుసుకోవాలని కూడా ఆయన అనుకోలేదు. అతనికి అవసరమున్నట్లు కూడా తోచలేదు. కానీ ఒక్కొక్కప్పుడు

కాలం ఏవో గీతలు గీస్తుంది. ఆ గీతల అంతరార్ధము జీవితం చదువుకుంటుంది. వాటిని అనుసరించ వలసివస్తుంది. అవి అదును తప్పినవే కావచ్చు. పదునైనవే కావచ్చు. పలుచనివే కావచ్చు. పచ్చనివే కావచ్చు. చిచ్చుపెట్టేవే కావచ్చు. చిరు దీపం వెలిగించేవే కావచ్చు. ముత్యాలమ్మ తన జీవితాన్ని గడపడానికి రకరకాల వృత్తులను అవలంబించింది. రకరకాల వ్యక్తులతో కలసి తిరిగింది. ఏతోటలో మొలచినా,ఏ నేలలో నిలిచినా, ఏ వాలులో పూచినా. గులాబి గులాబియేకదా! ముత్యాలమ్మ ఏ జీవిత విధానంలో నిలదొక్కుకొని పోయినా, ఆమె తన జీవిత పునీత సౌందర్య దామాన్ని మాత్రము తన మెడలో నిత్యం మంగళసూత్రంగా, ధరిస్తూనే వచ్చింది. వాసి తగ్గని జీవిత విధానము ఆమెది.

రాజారాం ఆమెను అర్థం చేసుకున్నాడు. ఆమె జీవిత విధానాన్ని నిత్యం చదువుకున్నాడు. ఆ రెండింటిని పోల్చుకున్నాడు. సరే అనుకున్నాడు.

ఒకరోజు రాజారాం ముత్యాలమ్మ ఇంట్లోనే ఉండిపోయాడు. ప్రొద్దుపోయింది. రాజారాంకు అక్కడినుండి వెళ్ళిపోవాలని అనిపించలేదు. ముత్యా లమ్మకు కూడ అతడు అక్కడ ఉండిపోతేనే బాగుండు ననిపించింది. ఆమె పదేపదే తన వ్యక్తిగత జీవితాన్ని గురించి చెప్పుతుంది. కొన్ని రహస్యాలను కూడ చెప్పుకుంటూ వెళుతుంది. అందులో ఒక రహస్యం.............
......................" ఒకనాడు ఒంటిగంట వేళ ఎవరో గేటు తట్టారు. ఆయనెవరో తనకు తెలియదు. అతడు ముత్యాలమ్మ ఇల్లు ఇదేనా అని ప్రశ్నించాడు. అవునన్నది.
"లోనికి రావచ్చా?" అని ప్రశ్నించాడు వచ్చిన అగంతకుడు.
"రండీ" అని ఆదరంగా అన్నది.
"దాహం" అన్నాడు, ఆ అగంతకుడు.
"నీళ్ళు తెస్తాను" అన్నది. అగంతకుని ముఖముపై చెమట బిందువులు కన్పించాయి. అతని కన్నులు ఏదో వెదుకుతున్నట్టు అటు ఇటు చూడసాగినవి. దప్పికతో ఉన్నవాడు, ఏ భావిని దూరము నుండి చూచినా అందులో ఉన్నవని అనుకుంటాడు. మెల్లగా భావి దగ్గరికి చేరుతాడు. అందులో నీళ్ళు లేకపోతే నిరాశ పడిపోతాడు. అలాగే కామాంధుడు ఏ నారీమణిని చూచినా, అపోహపడతాడు. తను ఆశించిందే ఆమె ఆశిస్తుందని అనుకుంటాడు. పచ్చ కామెర్ల వాడికి లోకం పచ్చగానే కనిపిస్తుంది. అలాగే ఇంటిలోనికి దూసుకొచ్చిన జగ్గయ్యకు ఆమె కన్నుల్లో ఆయన ఊహించిన కవనకామిని కనిపించింది.

అతని కోడెనాగు నడకలు, కొంటె చూపులు, అరకొరగాని మాటలు అనర్ధకంగా పొంగివచ్చే ఉబలాటం చూచిన ఆమెకు వణకుమొదలైంది.

ఆపుకోలేక అగంతకుడు ఆమెను ఏదో అడిగేశాడు. నేను అవునన్నాను. నేను వలలోచిక్కాడనుకున్నాడు. అలా నెమ్మదిగా నెమ్మదిగా పలకరిస్తూ ద్వారమువద్దకు వచ్చాను. ఎక్కడి నుండి ధైర్యం వచ్చిందో చెప్పలేను కానీ, ఒకటే పరుగు తీశాను. పరుగు తీస్తూ, తీస్తూ మధ్యలో పడిపోయాను. ఆరోజే నేను నిర్ణయించుకున్నాను. ఒంటరిగా ఉండనని". అంటూ ముత్యాలమ్మ చెప్పుకు పోతుంది. ఆ సంఘటనను గురించి చెప్పగానే ఆమె శరీరం వణకిపోతున్నది.

రాజారాం ముత్యాలమ్మకు ధైర్యం చెప్పాడు. ముత్యాలమ్మ నిదానంగా రాజారాంను చదువుకుంది, అర్థం చేసుకుంది. అతన్ని తన మనసులో నిలుపుకుంది.

రాజారాం పురుషుడు, ముత్యాలమ్మ స్త్రీ. వారి ప్రేమలు ఈ ప్రపంచంలోని స్వార్థభరితమైన ప్రేమ సూత్రాలకు ఎంతో దూరము. వారి ప్రేమ - విచిత్రమైనది- దానికి - రంగు లేదు - రూపులేదు - రసములేదు - ఆకారము లేదు-వారు కలసినట్లే ఉంటారు. కాని వేరువేరుగా ఉంటారు. అకాశము, భూమి అడుగడుగునా కలసినట్లే ఉంటుంది. కాని ఎక్కడా కలవదు. రాజారాం ముత్యాలమ్మ మనసులు ఎప్పుడూ దగ్గర దగ్గరే ఉంటాయి. కానీ వారి భౌతికకాయాలు మాత్రం దూరం. దూరం అతిదూరం. వారి జీవితం లోకానికొక పాఠ్యపుస్తకం.



# పుస్తక సమీక్ష

## ప్రతిబింబాలు
## (ఖండకావ్యకదంబము)

హృద్యమూ, అనవద్యమూ అయిన పద్య రచనలో ఆరితేరినవారు శ్రీ ఊట్లకొండయ్య. వీరు ఇదివరలో సంతరించిన 'వానవచ్చె-వరదవచ్చె' చాకిరేవు! మొదలైన కృతులు సహృదయుల మన్ననలందుకున్నవి. 'చాకిరేవు' కావ్యానికి తెలుగు విశ్వవిద్యాలయంవారి బహుమతి లభించింది. కొండయ్యగారు తమ గురువువైన కాటూరి వెంకటేశ్వరరావుగారి పేరుతో 'కాటూరికవితాపీఠం' అనే సంస్థనెలకొలిపి పుస్లక ప్రచురణ సాగిస్తున్నారు. శ్రీ కొండయ్య 76 ఏండ్ల వార్ధక్యంలో కూడా అవిశ్రాంతిగా కవితారచన చేయడం మిక్కిలి అభినందనీయం.

ప్రస్తుత పుస్తకం, ప్రతిబింబాలు ఖండకావ్య కదంబం. ఇందులోనివి ఒకగేయం తప్ప అన్నీ పద్యకవితలే. శీర్షికలు 26. పద్యాలు సులభశైలిలో ధారాళంగా సాగినవి. భావం స్పష్టత కలిగి పఠితలను ఆనందింపజేస్తున్నది. మచ్చుకు కొన్ని పద్యాలు ఉదహరింపబడుతున్నాయి.

"హిందూ ముస్లిం క్రైస్తవ
సందోహాస్పదము నా ప్రశస్తమతమ్మై
సుందర శివసత్యములకు
స్యందనమై ధరణికిన్ శుభావహమయ్యెన్

అంటూ గాంధీభక్తుడైన ప్రభాకర్జీని గూర్చి చెప్పిన ఈ పద్యం ఆయన వ్యక్తిత్వాన్ని ప్రకటిస్తున్నది.

విశ్వనాథ సత్యనారాయణను గూర్చి చెప్పిన ఈ దిగువ పద్యం మనోహరమూ, చమత్కారవంతమూ అయియున్నది.

"విశ్వనాథ యనుచ ౘబిలిచిన ౘ జాలును
మా త్రిలింగ పుణ్యధాత్రిలోన ౘ
బ్రన్ననంపు ౘ బాట కిన్నెరయై పాఱు౦
బద్యకోటి వేయిపడగలెత్తు"

'నరహరిజనుడు' అనే శీర్షిక కింద వ్రాసిన ఈ దిగువ పద్యం గమనింపదగినది.

"నాల్గుకులములు సృజియించినాను నేను
నాల్గుపాదాలు ధర్మమున్ నడుపుదునని
పంచమమ్మును గని యూరి బయటవైచి
నపుడె పాపాంకురార్పణ మాయెనాకు"

**ప్రతిబింబాలు**
రచన - ఊట్ల కొండయ్య
వెల రు. 6-00
ప్రతులకు :
కాటూరి కవితాపీఠం
మాధవి ప్రింటర్స్
హైదరాబాద్-500 027.

ఇంకా ఇందులోని 'శ్రీనాధపూజ' పుట్టినింటి ప్రమోద' అంగీరసతో అభిభాషణము" మొదలైన పద్యాలు భావయుక్తములై హృద్యంగా ఉన్నాయి.

**- దేముగంటి**

# సంస్కృతాంధ్ర నిఘంటువు

ఈ నిఘంటు రచయిత వత్సావెంకటశేషయ్య పందొమ్మిదవ శతాబ్దంలోని వ్యక్తి. ఈయన సంస్కృతాంధ్ర పండితుడుగా కనిపిస్తున్నాడు. వెంకటశేషయ్య మద్రాసులోని థియసాఫికల్ సొసైటీ మద్రాసు శాఖకు కార్యదర్శిగా ఉన్నవాడు. ఈయన అవతారికలో నిఘంటువును గూర్చడంలో తన ఆశయాన్ని ఈ విధంగా తెలియజేస్తున్నాడు.

"తెలుగులిపిలో సంస్కృతాంధ్రనిఘంటు వొకటియును లేకుండుట సాధారణముగ సంస్కృతాంధ్ర విద్యార్థులకును, ముఖ్యముగా రెండవభాష సంస్కృతముగాని, యాంధ్రముగాని, యేర్పరచుకొనిన యూనివర్శిటీ విద్యార్థులకును బాధకరముగనుండు సంగతి విశేష ముగ జెప్పనక్కరలేదు.

అందువల్లే తాను ఈ నిఘంటువు కూర్చానని చెప్పినట్లైంది. ఇంకా తన ఉద్దేశమును వెంకటశేషయ్య ఈలా వెల్లడించారు.

"తెలుగులిపిలో నిదివరకు ప్రచురింపబడిన నిఘంటువు లేవన నీశతాబ్దాదియందు మామిడి వెంకటాచార్యుల గారిచే రచింపబడిన శబ్దార్థకల్పతరువు, సర్వశబ్దసంబోధిని, అమరకోశము, నానార్థరత్నమాల మొదలగువానిలోలేని శబ్దములగు క్రియా పదముల యర్థమును విరించియున్నవాడను.

అకారాది నిఘంటువులు తన కాలంలో ఉన్నను క్రియాపదముల అర్థాన్ని తెలుపడం వెంకటశేషయ్య గారి ఈ నిఘంటువు యొక్క విశిష్టత.

ఉదాహరణకు కొన్ని క్రియా పదాలను పేర్కొనడం జరిగింది.

1. అవేక్షత (ధా) ఉక్షసేచనే చల్లెను (శప.ప)
2. కర్జతి(ధా) శప్-ప, కర్జగతే - వెళ్ళుచున్నాడు.
3. గుడతి(ధా) శప్ - ప-డుడ రక్షయాం - రక్షించుచున్నాడు.

సంస్కృతాంధ్రనిఘంటువు
రచన - వత్సా వెంకట శేషయ్య
వెల : 60 రూపాయలు
ప్రతులకు - ప్రాచీ పబ్లికేషన్స్
1-1-336/73 చిక్కడపల్లి, హైదరాబాద్.

4. సజ్జితే (ధా) ఆ-శప్- పజ్జవ్యక్తీకరణే విభాగము చేయుచున్నాడు.
5. మన్థతి (ధా) ప-శప్- చిలుకరించుచున్నాడు. కలియబెట్టుచున్నాడు. హింసించుచున్నాడు.
6. రుంటతి (ధా) ప-శప్- రుటేస్తేయే - దొంగతనము చేయుచున్నాడు.

క్రియా పదాలకు సంబంధించిన సంకేతములు ఈలా వివరింపబడినది.

**- వేముగంటి**



# వార్తా వాహిని

## హిందీ ప్రచారక ప్రశిక్షణ మహా విద్యాలయం - హైదరాబాదు హిందీ దినోత్సవము

ది. 14-9-95న హైదరాబాదులోని హిందీ ప్రచారక మహా విద్యాలయంలో దక్షిణ భారత హిందీ ప్రచార సభ (ఆంధ్ర) కార్యదర్శి శ్రీ అన్నదానం శంకరశాస్త్రిగారి అధ్యక్షతన హిందీ దినోత్సవము జరిగినది.

సభాధ్యక్షులు శ్రీ శాస్త్రిగారు హిందీ రాజభాష గాను, రాష్ట్ర భాషగాను వికాసము చెందుచున్నదనీ, ప్రాంతీయ భాషల సహాయంతో అది యింకా అభివృద్ధి చెందుతుందని చెప్పుచూ, హిందీ భాషా వ్యాప్తికి దక్షిణ భారత హిందీ ప్రచార సభ చేస్తున్న కృషిని వివరించి ప్రస్తుతము సభ అమృతోత్సవము జరుపుకుంటున్నదనిరి.

సభారంభమున సాహిత్య సంసద్ మంత్రి శ్రీమతి సీతామహాలక్ష్మి సభికులకు స్వాగతం చెప్పి అధ్యక్షుల వారిని పూలమాలతో అలంకరింపగా శ్రీమతి కవిత వారిని శాలువాతో సత్కరించినది.

శ్రీమతి కే.ఎల్. అన్నపూర్ణ బృందము వారు వందేమాతరం గీతాలాపన చేశారు.

సభాంతమున కుమారి ఆస్మా సిద్దికీ కృతజ్ఞతా వందనము చేసినది. జాతీయ గీతాలాపనతో సభ ముగిసినది.

## హిందీ దినోత్సవము - బి. గంగారం

హిందీ దినోత్సవము సందర్భంగా ఖమ్మం జిల్లా, బి. గంగారం జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో హిందీ దినోత్సవం జరిగినది.

ఈ మహోత్సవమునకు అధ్యక్షులుగా పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ టి.వి. పూర్ణచంద్రరావు, ముఖ్య అతిథిగా ఎల్.ఐ.సి. బ్రాంచి మేనేజరు శ్రీ పి.వి. ఎల్. నరసింహారావు కార్యక్రమమును నిర్వహించిరి.

శ్రీ జి రాధాకృష్ణయ్య, పాఠశాల హిందీ పండితులు శ్రీ టి.యస్.వి. ముకుందాచార్యులు హిందీ భాషా ప్రాముఖ్యతను గురించి, భారతీయ భాషల సామరస్యం గురించి ప్రసంగించిరి.

ఈ సందర్భంగా 94 ఫిబ్రవరిలో ప్రారంభిక పరీక్షలలో ఉత్తీర్ణులయిన విద్యార్థులకు ప్రమాణ పత్ర వితరణ జరిగినది. జి. వెంకట్రామిరెడ్డిగారి వందన సమర్పణతో, స్నేహపూరిత వాతావరణములో హిందీ దినోత్సవము ముగిసినది.

నవసమాజ నిర్మాణములో గురుతర భాద్యత ధ్యాపకుల మీద ఉన్నదని చిత్తూరు శర్మన్ బాలి న్నత పాఠశాల ఆవరణమున జరిగిన గురు జోత్సవ సందర్భమున అధ్యక్షాసనమునుండి జిల్లా జడ్జి వీరాస్వామి నాయుడుగారు సూచించారు.

స్థటల ఉపాధ్యాయులు గురుతర బాధ్యత గొంచవలెనన్నారు.

జిల్లాలోని 42 ఉత్తమోపాధ్యాయులను రజత కము, శాలువా, ప్రశంసా పత్రము నగదు బహు నములతో సత్కరించారు. అందులో ముప్పురు ప్రచారకులు జనాబ్ రహీమ్ సాహెబ్ శ్రీ. సి. రాయణరెడ్డి. శ్రీ బుచ్చినాయుడుగారు గూడా



ప్రముఖ న్యాయవాది, స్వాతంత్ర్య సమరయోధులు ద.భా. హిందీ ప్రచారసభ భూతపూర్వ కార్యాధ్యక్షులు శ్రీ డి. శ్రీనివాసయ్యంగారు భగవద్గీతలోని జ్ఞాన యోగంలోని ఉద్ధరణలతో జ్ఞానదాతల కర్తవ్యాన్ని సమన్వయ పరస్తూ ప్రబోదించారు.

జిల్లా కలెక్టరు శ్రీ సురేందర్‌గారు పండిత రాధాకృష్ణుల చిత్రపటమును పుష్పమాలాకృతం జేశారు. జ్యోతిని ప్రజ్వలింపచేశారు. కబీరు దోహాలతో గురుమహిమను గుర్తుజేశారు. సమాజము ఎదుర్కొను సమస్యలనుండి విముక్తి పొందుటకు భావిపౌరుల

...న్నారు.

జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ తోడ చెంచయ్యగారు స్వాగతం పలుకగా జిల్లా అధికారి శ్రీ సుబ్రహ్మణ్యం పిళ్ళగారు రాష్ట్రపతి ప్రధానమంత్రుల సందేశాలను వినిపించి అవార్డు పొందిన వారిని శ్రోతలకు పరిచయం చేశారు. శ్రీ యం.డి. నాయుడుగారు కృతజ్ఞతాభివందనములు తెలిపారు.

తెలుగు పండితులు మురళిగారు వినోద కార్యక్రమములు నిర్వహించారు.

## హిందీ-దినోత్సవ వేడుకలు

తే 14-9-95 ఉదయ 10 గం॥లకు స్థానిక గవర పాలెం బాలికోన్నత పాఠశాలలో హిందీ దినోత్సవ వేడుకలు ఆంధ్ర నరసింహ మూర్తిగారి అధ్యక్షతన ఘనంగా జరిగాయి ముఖ్య అతిధిగా విచ్చేసిన శ్రీ వల్లూరి పైడారావుగారు మాట్లాడుతూ శ్రీ పి.యస్. జగ్గారావు, హిందీ ప్రచారకులు హిందీ ప్రేమీ మండలిస్థాపించి దక్షిణభారత హిందీ ప్రచార సభవారి ద్వారా హిందీని వ్యాప్తి చేస్తున్నందుకు అభినందించారు.

మున్సిపల్ విద్యాకమిటీ సమావేశములు పాఠశాలల్లో నిర్వహించి, ఆయా పాఠాశాలలస్థితి గతులను తెలిసికొని విద్యా ప్రమాణాల పెంపుదలకు కృషిచేయుదుమని తెలియజేసిరి.

శ్రీ వినయానంద్ గారు మాట్లాడుతూ హిందీ జాతీయ భాషయని హిందీ నేర్చుకొన్నచో భారతదేశంలో ఎక్కడైనా స్వేచ్ఛగా సంచరించ వచ్చునని తను అనుభవాలను జోడించి తెలిపిరి.

శ్రీ బొగ్గారపు పర్వేశ్వరావుగారు మాట్లాడుతూ హిందీ భాష గొప్పతనాన్ని వివరించిరి. హిందీలో కవితలను వినిపించి విద్యార్థులను ఆహ్లాదపరచిరి.

శ్రీ నరసింహమూర్తిగారు స్వాగతంపలికిరి.

అమృత్‌హిందీ పరీక్షలలో ఉత్తీర్ణులైనవారికి ప్రమాణ పత్రములు, పోటీ పరీక్షలలో నెగ్గిన వారికి బహుమతులు అందించిరి.

శ్రీ బి. నాయుడుగారు వందన సమర్పణచేసిరి.

## హిందీ వారోత్సవ నివేదిక

ది. 14-9-95న మధ్యాహ్నం గం. 3-30 ని॥లకు వనవాసి ఎ.పి. రెసిడెన్షియల్ పాఠశాల హిందీ పండితులు శ్రీ భాదర్ బాషాగారిచే జ్యోతి ప్రజ్వలనము ద్వారా "హిందీ వారోత్సవములు'' ప్రారంభమయినవి. సభకు శ్రీ ప్రసాదరావుగారు అధ్యక్షత వహించగా, హిందీ పండితులు శ్రీయుతులు రూపేంద్రసింగ్, యం.యల్.వి.ఆర్. ప్రసాద్, శ్రీ సుబ్బారెడ్డిగార్లు వేదికనలంకరించిరి. అధ్యక్షులవారు, ముఖ్య అతిథి హిందీ ప్రాశస్త్యమును వివరించగా, హిందీ పండితులు హిందీ వారోత్సవముల విశేషతను వివరించారు. అనంతరము దక్షిణ భారత హిందీ ప్రచారసభవారి పరీక్షలలో ఉత్తీర్ణులైన విద్యార్థినీ విద్యార్థులకు ముఖ్య అతిథి ద్వారా ప్రమాణ పత్రములు ఇవ్వబడినవి. జాతీయ గీతాలాపనతో నాటి సభ ముగిసినది.

15-9-95న హిందీలో దేశభక్తి గీతాలాపన పోటీ జరిగినది. అందులో పలువురు విద్యార్థినీ-విద్యార్థులు అత్యంత ఉత్సాహముగా పాల్గొన్నారు.

16-9-95న హిందీ వ్యాసరచన పోటీ జరిగినది.

తర్వాత హిందీ అంత్యాక్షరి పోటీ జరిగినది.

20-9-95న సమాపన సభ జరిగినది. ఆదోనిలోని ప్రసిద్ధ హిందీ ప్రచారకులు శ్రీ కె. శివకుమార్ గారు ముఖ్య అతిథిగా విచ్చేసి హిందీని నేర్చుకోవలసిన ఆవశ్యకతను వివరించారు. తర్వాత హిందీ వారోత్సవ సందర్భంగా నిర్వహించిన వివిధ పోటీలలో విజేతలైన విద్యార్థినీ, విద్యార్థులకు ముఖ్య అతిథి ద్వారా బహుమతి ప్రదానం గావించబడినది. ఈ కార్యక్రమములు విజయవంతం కావడంలో విద్యాలయ ప్రిన్సిపాల్ గారైన శ్రీ ఎస్.వి. రెడ్డెప్పగారి సహాయము ఎంతో ఉన్నది. వారు ఎంతో సహృదయతో ఈ కార్యక్రమముల నిర్వహణకు అవసరమైన ఆర్థిక, సహకారము నిచ్చినారు. వారికెంతో కృతజ్ఞతలు.

# మహబూబ్‌నగర్ జిల్లా అమృతోత్సవ మహాసభలు

తేదీః 17-9-95న మహబూబ్‌నగర్ పుర మందిరములో జిల్లా అమృతోత్సవ మహాసభలు జరిగినవి. ఉదయం 9 గం॥లకు జాతీయ పతాకవందనం తరువాత దేశభక్తి గీతాలాపన ప్రార్థనతో సభా కార్య క్రమము ప్రారంభమైనది. సభలో జిల్లానుండి కేంద్ర రక్షణ శాఖకు సలహదారులుగా, పురపాలక సంఘ అధ్యక్షులుగా వున్న శ్రీ. జి. సహదేవు యాదవ్‌గారు పాల్గొనిరి. ప్రచారక మండలి అధ్యక్షులు శ్రీ రాకూరు భరత్ సింగ్‌గారు అధ్యక్షత వహించిరి. తర్వాత కార్య క్రమము ప్రారంభమైనది. శ్రీ చవాకుల నరసింహమూర్తి జ్యోతి ప్రజ్వలన గావించిరి. శ్రీ రాకూర్ భరత్‌సింగ్ గారు సభకు హాజరైన అతిధులకు సభికులకు స్వాగతము పలికి హిందీభాష ప్రాముఖ్యతను గురించి మాట్లాడిరి.

సభకు హాజరైన ఉస్మానియా యూనివర్శిటి ప్రొఫెసర్ డా॥ టి. మోహన్‌సింగ్‌గారు, ఇంటర్ మిడియట్ పాఠ్యపుస్తకం సంపాదకులు డా॥ ప్రొఫెసర్ శ్రీమతి లీలాజ్యోతి గారు, డా॥ భారత్‌భూషణ్‌గారు ప్రొఫెసర్ డా॥ బిజెంద్రనారాయణ సింహ పాల్గొనిరి. వీరు హిందీభాష విశిష్టతను గూర్చి హిందీ రాజభాష అనియు రాష్ట్రీయభాష అనియు, భారతీయ భాష అనియు భారతీయ సంస్కృతి సభ్యతను తెలియ పరిచే భాష అనియు అనుసంధాన భాష అనియు దేశ స్వాతంత్ర్యమును సంపాదించిన భాషఅనియు తెలిపిరి.

స్వాగత సమితి సభ్యులు సి.హెచ్. చంద్రయ్యగారు స్థానిక డిగ్రీ కాలేజీ హిందీవిభాగ అధ్యక్షులు, శ్రీ ద్వారకా దాస్, స్థానిక డిగ్రీ కాలేజి హిందీ ఆచార్యులు, శ్రీరాంచందర్ గారు, శ్రీ జి. రమాకాంత్ లెక్చరర్ గారు, శ్రీ .డి. సీనయ్య లెక్చరర్‌గారు, శ్రీ.డి. శ్రీదర్‌రావు హిందీ పండిత్‌గారు, హిందీ భాష ప్రచార ప్రాముఖ్యతను గూర్చి ప్రసంగించిరి.

శ్రీ. యన్. సాయన్నగారు. శ్రీ.ని. ఈశ్వరయ్యగారు, మరియు శ్రీమతి శీలాబాయిగారు హిందీ భాషను గూర్చిన కవితలు వినిపించిరి. ఆనాటి ఉదయ కాలపు సమావేశము ప్రచారకమండలి కార్యదర్శి శ్రీ. టి. బసవన్న జిల్లా హిందీ ప్రచారకమండలి మహబూబ్‌నగర్ గారి వందన సమర్పణతో ముగిసినది.

రెండ సభ భోజన విరామము తర్వాత స్వాతంత్ర్య సమర యోధుడు మహబూబ్‌నగర్‌జిల్లా హిందీ ప్రేమీమండలి అధ్యక్షులు శ్రీ. కె.జి. అడిహప్ప ఆర్య అధ్యక్షతన జరిగినది. అందులో కేంద్ర రక్షణ శాఖకు సలహారారులుగా ఎన్నికైన శ్రీ. డి. సహదేవు యాదవ్‌గారికి సన్మానము జరిగినది. శ్రీ. జి. వెంకట్రావు జిల్లా పరిషత్తు అధ్యక్షులు ముఖ్యఅతిధిగా, శ్రీ సత్తూరు రాములు జిల్లా గ్రంధాలయ సంస్థ అధ్యక్షులు ప్రత్యేక ఆహ్వానితులుగా ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారక మండలి అధ్యక్షులు శ్రీ కాజ వెంకటేశ్వర్‌రావు గారు ఆంధ్రసభ కార్యదర్శి శ్రీ అన్న దానము శంకర శాస్త్రిగారు అధ్వర్యమున సన్మానసభ కార్యక్రమము జరిగినది. అందులో హిందీ ప్రచారము గావించిన ప్రచారకులకు విశిష్ట సేవలు చేసిన ఆచార్యులకు సభకు విచ్చేసిన ప్రముఖులకు అభిమానులకు అందరికి సన్మానములు జరిగినవి. ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేసిన తరువాత జాతీయ గీతముతో మహాసభ ముగిసినది.



# మహబూబ్‌నగర్ జిల్లా అమృతోత్సవ మహాసభలు






*17.9.95 సం॥ మహబూబ్‌నగర్ జిల్లా అమృతోత్సవ మహాసభలు జరిగిన సందర్భములో తీయబడిన ఛాయా చిత్రం. ఇందులో కుడి నుండి ఎడమకు - శ్రీమతి శీలాబాయి. శ్రీమతి ఇలలేఖామాన్, సర్వశ్రీ టి. బసవన్న, శ్రీనివాసన్. సి. హెచ్. వెంకటరావు, సి. రామకృష్ణారావు, శ్రీ చవాకుల నరసింహమూర్తి, జి. అరుణాచంద్ర. శ్రీ డి. శ్రీధర్‌రావు. మహమ్మద్ జహంగీర్‌ఖాన్ ప్రభృతులు వున్నారు.*



దక్షిణ భారత హిందీ ప్రచార సభ - అమృతోత్సవ మహాసభలో ప్రసంగిస్తున్న
శ్రీ కె. అడివప్పగారు, ప్రేమీమండలి అధ్యక్షులు;
కూర్చున్నవారిలో శ్రీ జి. సహదేవు యాదవుగారు, మునిసిపల్ ఛైర్మన్; శ్రీ జి. వెంకటరావు,
జిల్లాపరిషత్ అధ్యక్షులు; శ్రీ చవాకుల నరసింహమూర్తిగారు, ద.భా.సభ, కోశాధ్యక్షులు వున్నారు.

Edited Printed and Published by A. Sankara Sastry on behalf of the D.B. Hindi Prachar Sabha - Andhra, Khairatabad, Hyderabad-500 004.